శ్రీ ఈశ్వర దేవతాయ నమః

# Sri Krishna Geeta.

# శ్రీ కృష్ణగీత.

అను

భగవద్గీతకు తెలుగు పద్యకావ్యము.

బ్ర॥ శ్రీ॥ ఉప్పల వెంకట కవిచే రచింపబడి

బ్ర॥ శ్రీ॥ చెళ్లపిళ్ల వెంకట కవిగారిచే పరిష్కరింపబడినది.



మొదటి కూర్పు 1200

బ్ర॥ శ్రీ॥ పాలపర్తి వెంకట నరసింహారావుగారిచే

ప్రకటించబడినది.

శ్రీ వేంకటేశ్వర సహాయ ముద్రాక్షరశాల.

బెజవాడ.

1931

సీ॥ భక్తిచేఁ నిత్యమ్ముఁ భాసిల్లు నాబుద్ధి
సవ్యతరంబైన నావగాఁగ
సరసిజాక్షుని దయా సంసిద్ధిఁ బాడము సం
కల్పమే నెట్టెడి కఱ్ఱగాఁగ
విమలుండైనట్టి మా వెంకటేశ్వర గురు
సత్కృపయే తెర చాపగాఁగ
శ్రీయుతుండౌ నరసింహరావను పుణ్య
మూర్తియే ప్రోత్సాహ కర్తగాఁగ
గీ॥ నధిగమించితి నుపనిషదర్థ జలధి
దాటినది రేవొ కాదొ సంభ్రమున నుండి
తెలియకుంటిని గట్టునఁ నిలచినాడు
వీడని తలంత్రుగాతఁనక విబుధవరులు.

ఇక విశేషించి వ్రాయుటకు సమర్థుఁడఁగాను గనుక నిక నీయుపోద్ఘాతము విరమించుచున్నాడను. అచ్చుపొరపాటుగాని నాపొరపాటుగాని యున్న రెండవ ముద్రణమున సవరించుకొనియెదను.

ఇట్లు పండిత విధేయుడు
ఉప్పల వెంకటశాస్త్రి
అష్టావధాని.

## — పండితాభిప్రాయములు —

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీకృష్ణగీత.

ఈ పేరుతో ఉప్పల వెంకయ్య యను నూతన కవిచే నాంధ్రీకరింపబడిన శ్రీమద్భగవద్గీతను నే నతడు వినిపింపగా విని తత్తత్కాలమునందు నాకు స్ఫురించినంతవఱకు సవరణలను దెల్పితిని. ధార చక్కగానున్నయది మూలానుసరణము విషయము నీకవి యంతగా నియమము పెట్టుకొనకున్నను విరుద్ధార్థములు లేవనియే నేను నమ్మెదను ఇతనికి భగవద్గీతయందలి విశేషాంశములను గ్రహించునంతటి ప్రజ్ఞావిశేషము లేకున్ననుఁ కృతినందు వారికి ద్దానియందు గల యాదరాతిశయముచే నితడిద్దానికిఁ బూనవలసినవాడయ్యెను తిక్కన్నగారు తత్కాలపు నియమము ననుసరించి గీతలఁ బూర్తిగాఁ దెలిగింపక యుపేక్షించినను ఇటీవలఁ గొందఱు తెలిగించిరి ఆయాకృతులం దిదియు నొక్కటియై వన్నెఁగాంచునని నాయభిప్రాయము.

కడియము<br>తూర్పు గో॥ డి॥

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి<br>శతావధాని.

## శ్రీ వెంకటశాస్త్రి రచించిన శ్రీకృష్ణగీతను గురించి

## — అభిప్రాయము —

మృదుపదములతోడను మృదు సమాసములతోడను సముచిత విశేషణములతోడను వివక్షితములైన యర్థములను రసభావాదులను బోషించెడి ధోరణి యీకబ్బమున సాజమై యంకురావస్థను దాటుచున్నది యతిస్థానము అనపేక్షితార్థకములు గాని యనావశ్యకపదములుగాని కాకయు సొంపుగూర్చెడిని.

కొవ్వూరు<br>పశ్చిమగోదావరి జిల్లా<br>5-8-31

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి<br>(శతావధాని) సాహిత్యోపాధ్యాయుడు,<br>ఆంధ్రగీర్వాణ విద్యాలయము.

# విషయసూచిక.

# శుద్ధపత్రము

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 4 | 18 | 12 | వ్రాయబూాన | వ్రాయబూాన |
| 11 | 52 | 1 | అవని | అవనిప |
| 12 | 61 | 2 | సంహ్మా | సంహా |
| 13 | 68 | 4 | నరునుంహు | నర్జునుండు |
| 14 | 70 | 4 | మెచ్చ | మెచ్చ |
| 14 | 78 | 1 | వాడెన్ష | వాడెడ్ష |
| 15 | 80 | 1 | స్త్రాల | స్థాల |
| 15 | 81 | 3 | పూర్న | పూర్ణ |
| 18 | 93 | 3 | దరనర | దనర |
| 19 | 99 | 4 | బొనంగు | బొసంగు |
| 19 | 101 | 4 | చంలిపని | చలింపని |
| 20 | 109 | 3 | జేయబడు | జేయబడును |
| ,, | 110 | 1 | వదలమను | వదలదు |
| 23 | 125 | 2 | సచయమన్న | సంచయమన్న |
| 24 | 133 | 1 | సీ॥ | గీ॥ |
| 25 | 136 | 12 | గొరదు | గోరదు |
| 26 | 143 | 2 | ధర్మమైన | ధర్మమైన |
| 27 | 150 | 3 | నెక్కుడు | నెక్కుడు |
| ,, | 152 | 3 | శిష్యుడనీ | శిష్యుడని |
| 28 | 155 | 2 | జన్మములు | జన్మములు |
| ,, | 156 | 4 | వృద్దియై | వృద్ధియై |
|  | 158 | 8 | వినుమి | వినుము |
| 29 | 161 | 3 | నిన్నెవ్వ | వన్నెవ్వ |
| 34 | 187 | 4 | రెంటనోకడ | రెంటనొకడ |

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 35 | 196 | 7 | మెన | మైన |
| 39 | 211 | 3 | గీ॥ | ,, |
| | 212 | 1 | ,, | గీ॥ |
| 40 | 216 | 3 | గాడుపుమె | గాడుపు మె |
| 40 | 217 | 1 | యోగాబ్యాసము | యోగాభ్యాసము |
| ,, | ,, | 11 | లేదింతక్న | లేదింతకన్న |
| 42 | 227 | 4 | శ్రీగరిష్ట | శ్రీగరిష్ఠ |
| 44 | 237 | 3 | విద్వా | విద్యా |
| 45 | 7 | 3 | భూతలముల | భూతముల |
| 46 | 9 | 4 | తథ్యమొప్పన్ | తథ్యమ్మొప్పన్ |
| 47 | 17 | 3 | వ్రాఘ్రు | వ్యాఘ్రు |
| 49 | 26 | 4 | రాడ్ధ్రతీ | రాడ్ధృతీ |
| 53 | 47 | 4 | భుపాల | భూపాల |
| 54 | 58 | 1 | మధిష్టాత | మధిష్ఠాత |
| 56 | 63 | 3 | చంప | ఛంప |
| ,, | 64 | 1 | బాస్కరుడ | భాస్కరుడ |
| ,, | | 2 | మెఘుండ | మేఘుండ |
| ,, | 65 | 3 | చందమెఱిగి | ఛందమెఱిగి |
| 57 | 66 | 12 | విడి | వీడి |
| 57 | 69 | 4 | చ్ఛందమనుచు | ఛందమనుచు |
| 58 | 71 | 4 | ద్రువంబు | ధ్రువంబు |
| 58 | 73 | 4 | నా | నో |
| | 74 | 4 | గాంచ | గాంచ |
| 60 | 86 | 3 | తోయతు | తోయజాతు |
| 61 | 89 | 3 | సంత | నంత |
| 62 | 95 | 4 | సమవర్తినెనట్టి | సమవర్తియైనట్టి |
| ,, | ,, | 6 | నేన | నేను |

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 63 | 99 | 6 | ప్రపంచాతరమున | ప్రపంచాంతరమున |
| 64 | | | ఏకదశధ్యాయము | ఏకాదశోధ్యాయము |
| 64 | 101 | 4 | ప్రీలుచుండె | ప్రీడుచుండె |
| 65 | 106 | 1 | దివ | దివ్య |
| 66 | 110 | 3 | దుతిన్ | ద్యుతిన్ |
| ,, | 115 | 12 | వేత్రి | నేత్రి |
| 67 | 117 | 2 | కోరలుగల్గి | కోరలున్గల్గి |
| 69 | 131 | 4 | విశ్వరూపినగు | విశ్వరూపివగు |
| 70 | 132 | 1 | నన్న | నను |
| 71 | 139 | 10 | నిశ్శంశయముగ | నిస్సంశయముగ |
| 72 | 146 | 4 | జెందదలమె | జెందదరమె |
| 74 | 159 | 10 | వైశ్ఛల్యమున | నైశ్చల్యమున |
| ,, | 161 | 1 | ధరణి | ధరణీ |
| ,, | ,, | 2 | ల్జర | ర్జర |
| 75 | 4 | 4 | నేవసించియుంట | నే నేవసించియుంట |
| 76 | 7 | 7 | చెలిమిమ్మై | చెలిమిమై |
| ,, | 11 | 3 | శ్రేష్టమని | శ్రేష్ఠమని |
| 77 | 13 | 1 | జేతు | జేతు |
| 78 | 16 | 1 | దు:ఖముములున్నన్న | దుఃఖములున్నన్న |
| 80 | 32 | 3 | జన్మమందురు | జన్మమందరు |
| ,, | ,, | 4 | మందురు | సుందరో |
| ,, | 33 | 4 | నిజుము | నిజము |
| 80 | 34 | 1 | వెయ్యో | వెయ్యో |
| 81 | 35 | 5 | టనితమై | జనితమై |
| 83 | 45 | 3 | శచత్రయమ్ము | శత్రుచయమ్ము |
| 83 | ,, | 12 | న్గర్తగా | న్గర్గగా |
| 87 | 67 | 2 | సృష్టిభెద | సృష్టిభేద |

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 88 | 70 | 3 | నోనర్పగ | నౌనర్పగ |
| ,, | 72 | 5 | జానహీనత | జ్ఞానహీనత |
| 89 | 73 | 5 | జంపెదనింక | జ్జంపెదనింక |
| ,, | ,, | ,, | జంప | జ్జంప |
| 90 | 78 | 11 | ప్రధానతగగలుగు | ప్రధానతగలుగు |
| 92 | 88 | 3 | భూధాళి | బుధాళి |
| 93 | 94 | 3 | ఖచరనాఱ | ఖచరనాథ |
| ,, | 95 | 3 | బటంచని | బటంచ్చని |
| 95 | 104 | 4 | గాంచబోడు | గాంచ్చబోడు |
| 96 | 112 | 2 | త్రివిఖము | త్రివిధము |
| 101 | 134 | 2 | కారామెన్న | కారమెన్న |
| 102 | 141 | 2 | సేవ | సేవ |
| ,, | 142 | 9 | యుక్తమా | యుక్తమా |
| 103 | 144 | 4 | బెండాడుదు | జెండాడుదు |
| 104 | 151 | 4 | ధ | ద్ధి |
| ,, | | | సంపూర్ణము | శ్రీకృష్ణగీత సంపూర్ణము |

ఓం

శ్రీకృష్ణాయనమః

# ఇష్ట దేవతా ప్రార్థనము.

ఉ॥ శ్రీకరమాద్యమార్య జనసేవ్యము దివ్యమనంతమవ్యయం
బేక మహీనమద్భుత మనేక చరాచరసంచయాత్మ మ
స్తోకము శాశ్వతమ్ము పరిశుద్ధ మవిద్ధ మనింద్యవంద్య మ
వ్యాకుల మప్రమేయమగు బ్రహ్మము నెమ్మది నాశ్రయించెదన్. 1

మ॥ నిజహస్తమ్మునఁ వేణుదండముల సన్నేత్రమ్ములున్ నవ్యపం
కజ శోభన్దులకించు నెమ్మొగము శ్రీగంధావలిప్తాంగమున్
వ్రజభామాకరపీడనాభ్యుదిత భవ్యంబొప్పియున్నట్టి యా
త్రిజగత్సేవ్యు ముకుందు గృష్ణు మది జింతింతు న్త్రికాలమ్ములన్ 2

మ॥ వెలయంగాఁ విధివై రజోగుణముచే విశ్వంబు సృష్టించి య
వ్వలఁ బద్మాక్షుడవై నిరంతరముఁ సత్వంబూని రక్షించి యా
వలఁ రుద్రాకృతివై తమోయుతుడవై భంజించు నిన్గొల్తు ని
శ్చల నిస్సంగ నిరంజనాగతభయా సర్వేశ సర్వాత్మకా. 3

మ॥ తలపన్నందునకా యశోదకును పుత్రప్రేమ గల్పించి వా
రలకు న్మోదముగొల్పి గొల్లలకు మిత్రప్రేమగల్పించి కాం
తలకు న్సంతతమున్మదంబునఁ గళత్రప్రేమఁ గల్పించి య
త్యలఘుస్ఫూర్తి వహించు డింభకుని మాయామానవున్గొల్చెదన్ 4

శా॥ పాలూరన్దగు బుగ్గలున్ భుజములన్బట్టించు పుట్టంబు చే
గేల న్బిల్లనగ్రోవి గల్గునిను వీక్షింపంగ నాస్వాంత మే
వేళన్ గోరుచునుండుఁ గావునఁ సమావిర్భూతకారుణ్య హృ
న్నాళీకా నను బ్రోవ రాగదవె కృష్ణా గోపికావల్లభా 5

మ॥ తనయుండై జనియించి నెమ్మదికి మోదంబెప్పు గల్పించి లో
చనపర్వంబొనరించి దేవకి మనస్తాపంబువారించు పా
వనమూర్తిన్ వనజాసనాదివినుతున్ బద్మాక్షునిన్ బూర్ణచం
ద్రనిభాస్యున్మది సన్నుతింతు నిజభక్తత్రాణపారాయణున్. 6

సీ॥ సత్యభామాదేవి చతురవాక్యములాడ
గాళింది పాదపంకజము లొత్త
భద్ర చెంగటజేరి పైటకొంగునఁ వీవ
జెంగ సుదంత వసించియుండ
జాంబవతీదేవి తాంబూలమందీయ
లక్షణాదేవి మేలములుబల్క
మిత్రవిందాదేవి మేనగంధమలంద
భోజపుత్రిక శిఖపూలుజుట్ట
గీ॥ నెమ్మి కాంచనసౌధాంతరమ్ములోన
సుమవిరాజిత మృదుల తల్పమున మంద
హాస రుచిబొల్చు వదనతోయజము గల్గు
మాధవస్వామిగూర్చి నమస్కరింతు. 7
సీ॥ పాలించినావు ద్రౌపదికి పేరోలగ
మ్మునఁ మానభంగము దనరకుండ
రక్షించినావు నక్రముచేతఁజిక్కి ఘో
షించు మదేభమ్ము నంచితముగఁ
లాలించినావు విలాసమ్ముగాఁ ప్రేమఁ
బదియారువేల బింబాధరలను
తిలకించినాడవు దీర్ఘకటాక్ష సం
గత కృపాస్ఫురణఁ భక్తవ్రజమును
గీ॥ కలుషచిత్తులఁ ధార్తరాష్ట్రులఁ నడంచి
ధర్మసుతునకు ధారుణీతలముగూర్చి
నాడవచ్చ్యుత నిన్నెన్న నావశంబె
శేషశయన వినూత్న రాజీవనయన. 8
క॥ శర్వునకుఁ త్రిపురదానవ
గర్వాంధతమసవిభాత కంజాప్తునకు
న్సర్వేశునకు హిరణ్మయ
పర్వతచాపునకు నతులు భక్తినొనర్తున్. 9

గీ॥ నళినలోచనుడౌ విష్ణు నాభికమల
మందుబుట్టిన యాశతానందమూర్తి
కరుణ దీర్ఘాయువొసగి యీకబ్బమును ధ
రాతలంబున వెలయించుగాత సతము. 10

క॥ శరనిధికన్యక శీతల
గిరికన్యన్ వాణిదేవి గీర్తింతుమదిన్
సిరియును బహుళైశ్వర్యము
సరస కవిత్వమ్ముగోరి సదమలభక్తిన్. 11

గీ॥ బహుళ విఘ్నాంబుదవ్రాతపవనుఁడనఁగఁ
బరగునట్టి సనాతన పురుషవరుని
నవ్యవిద్యాప్రభావు వినాయకుని మ
నంబునన్ సంస్మరింతు సతంబుభక్తి. 12

—। సుకవిస్తుతి ।—

ఉ॥ శ్రీకరమైన రామకథ జెప్పి జగంబులఁ బేరుగాంచు వా
ల్మీకిని భారతాదు లవలీల రచించిన వ్యాసమౌని వి
ద్యాకరు కాళిదాసకవి ధన్యుల నన్నయ తిక్కనాది వి
ద్యా కలితాగ్రగణ్యుల సతంబు దలంచెద నెమ్మనమ్మునన్ 13

చ॥ స్ఫుట కవితావిశేష పరిశుద్ధ యశఃపరిభాతసర్వ ది
క్తటుని సమస్తశాస్త్రచయ తత్త్వవిశారదు శారదా లస
చ[illegible]ల కటాక్షసంగతుని సద్గుణభూషణు చెళ్ళపిళ్ళ వెం
[illegible]కవి శిష్యవత్సలుని గణ్యుని మద్గురువర్యు నెంచెదన్. 14

క॥ అనఘుని సుకవిత్వారం
భ నితాంతుని సర్వసుగుణ భావుని శుచిమ
జ్జనకుని నరసింహార్యుని
మనమున దలపోతు భక్తిమతమునసతమున్. 15

గీ॥ బాల్యగురుఁడుప్పలాన్వయభవుఁడు సరస
శబ్దసంయుతకవితా విశారదుండు
పిచ్చయాఖ్యుఁడు సామేలు పేర్మి నెసఁడు

గోరువాడౌట నాతని గొల్చువాడ. 16

గీ॥ వసుచరిత్రాదులైన కబ్బములుకొన్ని
పాఠముగ జెప్పి నన్నాకి పరమకరుణ
చేత నన్నింతవానిగా జేసినట్టి
యన్నపూర్ణయశాస్త్రి మా యన్నదలతు. 17

సీ॥ ప్రౌఢబుద్ధిని సత్యభామా జయంబాగి
విరచించినట్టి మా వెంకటేంద్రు
బరమార్థముగ ధృవోపాఖ్యానమెన్నఁ ర
చించిన సుకవి మా శేషకవిని
పార్వతీశంకర పరిణయమ్మను కృతి
గూర్చిన మా తాత కోటకవిని
శాస్త్రజ్ఞుడై సమస్తము నేర్చినట్టి మా
పెదతండ్రిఁ నన్నయ విపులకీర్తి

గీ॥ తక్కు మావంశభవుల విఖ్యాతకవీంద్ర
చంద్రుల యశంబు లాత్మలో సంస్మరించి
కాకవీంద్రులనెల్ల నాకబ్బమంట
వలదనుచు కబ్బమొక్కడు వ్రాయబూన. 18

—। కృతి కారణము ।—

గీ॥ పాలపర్తి కులార్ణవ పంకజారి
ఘనుడు నరసింహ్మరావు నన్వనజనాభ
చరణపంకరుహధ్యానపరుని వెంక
టేశ్వరునిగాంచ కౌతుకం బెసగపలికె. 19

సీ॥ చెరువును విత్తనిక్షేపంబు బ్రాహ్మణ
జాలపోషణము శివాలయంబు
ద్విజహితోపవన ప్రతిష్ఠయు గ్రంథము
పరికించికొనుట కూపప్రతిష్ఠ
వేదధర్మజ్ఞులౌ విప్రులు సప్తసం
తానమ్ములని తెల్ప నేనువింటి

నటుగానఁ వాసుదేవార్జున సంవాద
మాంధ్రీకరించి సమంచితముగ
గీ॥ తజ్ఞులెల్లరు మెచ్చ మాతండ్రి కంకి
తమ్ముగా వ్రాయుమని యాదరమ్ముతోడ
బలికి నూత్నాంబరములు కప్రంపుతమ్మ
లమ్మొసంగిన నేసంతసమ్ము జెంది. 20
సీ॥ అనఘాత్మ యుపనిషదార్థమై సర్వమ
తానుకూలమ్ముగా నవనివ్యాస
భట్టారకునిచేత బ్రకటింపబడినట్టి
కృష్ణగీతార్థ మదేడమంద
మతినగు నేనేడ మాన్యులు బుధులు హ
రింప కబ్బమ్ము రచించుటేడ
నైన త్వదీయ వాక్యమ్ము బోద్రోయగా
నేటికి యోగీశ్వరేశు గృష్ణుఁ
గీ॥ భావమున నెంచి భారతీదేవిఁ దలచి
శ్రీకరంబుగ నేను రచింతుననుచు
బలికి కృతిపతివంశమ్ము లలితముగను
వ్రాయుదొడఁగితి నాదుభావమున మెచ్చి. 21

— । కృతిపతి వంశావళి । —

గీ॥ శ్రీకరంబభినందితాశేషబుధ చ
యంబు నంచిత ధర్మాకరంబు పాల
పర్తినావంశ మనయంబు భవ్యమగుచు
జెలగు వర్ణచతుష్టయ శేఖరంబు. 22
చ॥ వెలయు తదీయవంశమున విశ్రుతకీర్తిమనోజ్ఞమూర్తి ని
ష్కలుషు డుదారమానసుడు సంతతధర్మపథానువర్తి ని
శ్చలు డతినిర్మలుండు విల సత్కరుణాభరణుండు బుద్ధిచే
నలఘుడు సత్యవాది నరసప్పయనర్ణ జనియించె దొల్లిటన్. 23
క॥ ఆ విప్రకులార్ణవ శశి
సావిత్రినోబ్బలునట్టి సాధ్వీమణి తా
దేవీమణిగా గైకొనె

సావిత్రమ నాగబోటి సతులకు మేటిన్. 24

మ॥ అరయన్వారికి పుత్రకుండు నిజశిష్యారాధ్యుఁ డుద్యద్గుణ
స్ఫురణుండాగమధర్మకర్మరతుఁడు సత్పూజ్యుండగణ్యుండు తీ
వ్రరజస్తామసముక్తుఁడార్యమణి శ్రీరామాభిధానుండు భ
క్తి రసావిష్టమనోంబుజాతుఁడు కృపార్ద్రీభూతచిత్తుండునౌ 25

గీ॥ కీర్తి వరుడట్టి శ్రీరామమూర్తితాను
మొదట బున్నమ్మ నాదగు ముదిత పెండ్లి
యాడ నాయమ జేరె లోకాంతరమున
కాడుపడు చెన్న బుట్టింటి కరుగునటుల. 26

వ॥ పదంపడి

ఉ॥ అమ్మహనీయమూర్తి జనులందరు మెచ్చ వివాహమాడె ధ
ర్మమ్మె సహాయమై దనర రాజిలుకొమ్మల మేలుబంతి స
త్యమ్మె నియామకమ్మయిన ధన్యచరిత్ర బవిత్రరాజ్యల
క్ష్మమ్మను దీనపోషణవిచారిణి సాత్త్వికకర్మచారిణిన్. 27

గీ॥ వారు నారాయణాంఘ్రిపంకేరుహద్వ
యమ్ము చిత్తమ్ములందు నిత్యమ్ము నిలిపి
తత్ప్రసన్నత గనిరి సంతానసుఖము
మోదములు మానసమ్ముల మొలకలెత్త. 28

వ॥ తత్సంతానంబును జ్యేష్ఠానుక్రమంబుగాఁ బ్రత్యేక స్త్రీపురుష వర్ణనం
బంగీకరించెద నెట్టనిన 29

సీ॥ నిరతాన్నదానతత్పరతచే సజ్జన
శేఖరుండగు నరసింహరావు
పరికింప దేవతాభక్తిచే దుర్వార
కిల్బిషహరుడైన కృష్ణరావు
సత్కర్మసంచయాసక్తుడై వెలయు వెం
కటరావు గుణములగములరావు
నిర్మలగుణగణాన్వితుడై నిరంతర
సువ్రతుండై యొప్పు సు[illegible]రావు

గీ॥ యాశ నిర్మలకీర్తి ప్రకాశరావు
భద్రగుణుడైన శ్రీవీరభద్రరావు

నాగరార్యవరు సంతతానందయుతులు
శాంతమతులిద్ధ ధర్మానుసారగతులు. 30

గీ॥ వీరి నార్యవరఁగాంచి కోవిదులుసతము
జలజసంభవుడెన్న షట్శాస్త్రములయు
సారము గ్రహించి యీరీతి క్ష్మాతలమున
వెలయచేసె నిజంబని పలుకుచుంద్రు. 31

క॥ వారలలోపల నరసిం
హారావు ముదాన పరిణయమ్మయ్యెను సా
ధ్వీరత్నము తులిశమ్మను
శ్రీరాముం డవనిజాత జేకొనుభంగిన్. 32

గీ॥ వీరికి నృశింహశాస్త్రియు వెంకటేశ
రావు నాదగు పుత్రకరత్నములు జ
నించి రొక పుత్రికారత్న మంచితముగ
నలరె వేట్క మహాలక్ష్మమాంబయనగ 33

సీ॥ పిదపఁ గృష్ణారావు పెండ్లాడెఁ గామేశ్వ
రాంబయన్సుగుణకదంబవారు
మాధవచరణయుగ్మమ్మనన్వహమ్మును
తతభక్తిఁగొల్చి యాతని కటాక్ష
మున హనుమాయమ్మ యను తనయామణి
బడసి యావలఁ దనూభవుల బడసి
రిరువుర వెంకటేశ్వరశర్మయనువాని
నాంజనేయాభిఖ్యు డనెడు తనయు

గీ॥ నవల వెంకటరావు మీనాక్షమాంబ
రుక్మిణమ్మయనంగ సరోరుహాక్షి
రూఢిఁబెండ్లాడె నందులో రుక్మిణమ్మ
గనియె శ్రీరామమూర్తి నాఁదనయునొకని. 34

గీ॥ పుణ్యుడా సుబ్బరావన్న పూర్ణమాంబ
బరిణయంబయ్యెనట్టి దంపతులు గనిరి
సుతునిఁ గృష్ణాఖ్యు వెంకట సుబ్బమాంబ
నాగలక్ష్మమ్మయనియెడి నందనలను. 35

గీ॥ ఘన గుణాన్వితుండైన ప్రకాశరావు
రాజ్యలక్ష్మమ్మ గొనియె దారగను పిదప
వీరభద్రేశరావు తా వేడ్కతోడ
శాంతమాంబను పెండ్లాడె సరసులెన్న. 38

వ॥ పాలపర్తికులకలశవార్ధిచంద్రముండగు శ్రీరామాభిఖ్యునకు గల స్త్రీ
సంతానం బెట్టిదనిన 39

గీ॥ స్థిరతసాత్వికగుణమె మూర్తిభవించె
నిటులనని కోవిదాగ్రణు లెన్నుచుండ
నలరె భూస్థలిలో ప్రసూనాంబ నాగఁ
గాన నాయమసాటిగా గలరెయెందు. 40

గీ॥ అరయ జ్ఞానాంబ మాణిక్యమాంబ వారి
కవల జనియించె సావిత్రమాంబ యింత
వరకు శ్రీరామయాఖ్యుని వంశమింక
వృద్ధియాగాక హరికృపా సిద్ధిచేత. 41

— షష్ఠ్యంతములు —

క॥ శ్రీరామాఖ్యునకు సదా
చారునకుఁ న్బాలపర్తి సత్కులవిమలాం
భోరాశి చంద్రునకు గత
ఘోరాఘప్రచయునకును గోవిదమణికిన్. 42

వ॥ అంకితంబుగాఁ నభ్యుదయ పరంపరాభివృద్ధిగాఁ నా యొనర్పంబూనిన
గృష్ణగీతకు ప్రారంభం బెట్టిదనిన 43

# శ్రీకృష్ణగీత

## ప్రథమాధ్యాయము.

## — అర్జున విషాదయోగము —

( ప్రథమాశ్వాసము. )

—* కథాప్రారంభము *—

సీ॥ నరవరుఁడా హాస్తినాపురాధీశుండు
ధృతరాష్ట్రుఁడంచిత ధృతియుతుండు
సంజయుఁడను వ్యాస సంయమిశిష్యుని
గనుగొని యిట్టులఁ బల్కఁగసాగెఁ
మహాత్మ యిట్టుల ధర్మక్షేత్రమైన కు
రుక్షేత్రమునకు ధీరులు మదీయ
పుత్రకులు న్పాండుపుత్రులు సంగర
వాంఛనే తెంచి యవ్వేలమతేమి
గీ॥ జేసిరయ్యదినాకు వచింపుమనినఁ
సంజయుఁడు బల్కె వినుము రాజా త్వదీయ
పుత్రకుడు పాండురాజేంద్ర పుత్రసేన
గాంచి ద్రోణునిఁతోడ వచించెనిట్టుల. 44
గీ॥ దేవ ద్రుపదాత్మజుండల ధీరుఁడిపుడు
పన్నియున్నట్టి సైన్యమా పాండవేయ
సైన్య మాచార్య చూడుమా సైన్యమందు
గలమహారథగణమును దెలుపువాఁడ. [redacted]
సీ॥ సాత్యకి పాంచాల జనపతి మత్స్యభూ
కాంతుండు శైబ్యుండు కాశిరాజు
చేకి తానుఁడు పురజిత్తుమాధీశుండు
పాంచాలి సుతులు సుభద్రకొడుకు
కుంతిభోజుఁడు రాజకుంజరుండో ధృష్ట
కేతువు నరులకు భీతిగొల్పు

మహితబలుండుత్తమౌజుండుయుయుధానుఁ
డాయుధామన్యుఁడా యర్జునునకు
గీ॥ భీమునకు సాటియైన వారో మహాత్మ
ఇంక నాసైన్యమున నిరాతంకసత్వ
యుతుల దెలిపెద వినుడు సమ్మతినిమీరు
సరస గుణధుర్య శ్రీమదాచార్యవర్య. 46

వ॥ మరియును నీవును గాంగేయుడు గర్ణకృపాశ్వత్థామ వికర్ణభూరి శ్రవులును గాక నాకొఱకు ప్రాణంబులయం దాసవదలి వచ్చిన రాజులు పెక్కండ్రు గలరైనను భీమాభిరక్షితంబైన పాండవ బలంబునకు మత్సైన్యంబు చాలదని తలంచెదగావున మీరెల్లరు శాంతనవు న్గాచియుండుట గర్తవ్యంబు కారణం బేమంటేని

గీ॥ ధర్మతత్పరుఁడైన శంతనసుతుండు
పగర వెనుజూచి వెనువెంట దగులబోఁడు
వారు వెనువెంటబోరు-చో మీరు తాత
గాచికొనియుంట నామది గౌతుకమ్ము. 48

క॥ అని పలికెడు నీపుత్రుం
డను మోదింపంగ భీష్ముఁడట పూరించెన్
దనశంఖము పిమ్మటగల
జనపులు జెలగించి రఖిల శంఖారవముల్. 49

వ॥ అంతఁ బాండవసైన్యమధ్యంబున ధవళతురంగభాసిత స్యందనా రూఢులైన కృష్ణార్జునులు క్రమంబుగా బాంచజన్య దేవదత్తంబు లు బూరించిరనంతరమ్మున 50

సీ॥ బలియుండు భీముండు పౌండ్రమన్శంఖమ్ము
పూరించె దిక్కులు భోరనంగఁ
ధర్మాత్మజుండనంత విజయమ్ము నుదరం
జొత్తె వైరులు విని తత్తరిల్ల
నకులుండు విజితవైరికులుండు దానుఘో
షాఖ్యశంఖమ్మొత్తె నవనిబెదరఁ
సహదేవుఁడవల రాజవ్రాతములు మెచ్చ
మణిపుష్పకమ్మొత్తె మహితలీలఁ

గీ॥ మఱియు శినివల్లభుం డభిమన్యుఁడాది
గలుగు వీరాగ్రణులు రణకౌతుకాత్మ
లెల్లఁ భూవ్యోమములు బిక్కటిల్ల స్వీయ
శంఖరాజములొత్తి రాసమయమునను. 51

చ॥ అవని పాండుపుత్రులు తదాప్తులు శంఖములెల్ల నొత్త త
ద్రవములు నీకుమారులకు తన్నికటస్థితరాజపాళికిన్
జెవులఁ జొరంబడ న్హృదయసీమములెల్ల జలించెనంత వా
సవతనయుండు విల్లుగొని చక్కఁగ నెక్కిడి చక్రికిట్లనెన్. 52

సీ॥ దుర్గుణాన్వితుఁడైన దుర్యోధనునకు మో
దమ్ము గల్పింప యుద్ధమ్మొనర్ప
జనుదెంచినట్టి రాజవ్రాతము న్గాంచ
వాంఛించుచున్నాడ వారిజాక్ష
యటుగాన నుభయసైన్యములకు మధ్యమ
స్థలమున మనయరదంబునిల్పు
మన దేవకీసుతుండా సైన్యమధ్యమ
స్థలమున తా నరదంబునిలిపి

గీ॥ పలికెఁ భరతకులప్రదీపక ఘటోద్భ
వాపగా పుత్రులకును ముఖాంతరమున
నిలిచియుండిన సర్వావనీతలేశ
గణము కురుసైన్యమియ్యది గనుము పార్థ 53

వ॥ అనిన పార్థుండు

ఉ॥ మామలఁ నన్నలఁ న్హితసమాజములన్గురులన్పితామహ
స్తోమములాదిగాగలుగు చుట్టముల న్గురుసేనఁగాంచి సు
త్రామసుతుండు నెమ్మదిఁ దురంతవిషాదముఁబూని యాదవ
స్వామినిఁ గాంచి బిట్టగు విచారముతోఁడ వచించె నీవిధిన్. 55

సీ॥ మాధవా వినుము దుర్యోధనాధమునిమూ
లమ్మున నిప్పుడాలమ్మొనర్ప
వచ్చిన మద్బాంధవ వ్రాతమును దిల
కింపగాఁ మేనుజలింపుచుండె
వడిలేక ఎండెఁ వక్త్రమ్ము గాండీవమ్ము

జారుచునుండె హస్తమునసుండి
గురుభీతిచేతఁ గగుర్పాటు వొడమెను
కాన తేరునఁ నిల్వలేమనేను

గీ॥ నీరజాతాక్ష యేఁలొకో నిర్నిమిత్త
మైన విపరీతములుదోచె నయ్యనాకు
కటకటా చుట్టములనెల్లఁ గసిమసంగి
యవల సుఖయించు సుఖమేటికయ్య చెపుమ. 56

గీ॥ అంబుజాతాక్ష నాకు జయంబు వలదు
సౌఖ్యమంతకువలదు రాజ్యంబువలదు
స్వీయవిరహితమైన యీవిభవమేల
జీవితంబేల నాకు వచింపుమయ్య. 57

గీ॥ ఎవరికొరకిప్డు భోగము లవనిసుఖము
లేను గోరితినో వారలీరణమున
కేగుదెంచిరి ధనముల నెల్ల విడచి
ప్రాణముల వీడదలచి గోపాలనాథ. 58

వ॥ అందు వారెవ్వరంటేని

గీ॥ తండ్రులు గ్గురులు సుతులు దాతలును బావ
మరుదులున్ బౌత్రులు స్మైనమామ వరుస
వారలంబుజ నాభయువ్వారితోడ
గరుణవిడిసేయుటెట్లు సంగరము చెపుమ. 60

గీ॥ తతకలుషవర్తనుండైన ధార్తరాష్ట్రు
సంహరించుటచే మాకు సంభవించు
గల త్రిలోకాధిపత్యమే వలదతండ్రి
మమ్ము బొరిగొనవచ్చిన మానసమున
సైచియుండెదనని సేయజాల కృష్ణ. 61

వ॥ జనార్దనా యీగాంధారేయులు పాపాత్ములుగాన వారి జంపుట వలన మనకు పాపమొక్కడు దక్క సంతోషమేమియు లేదని తలంచెద

గీ॥ నాకు స్వీయులైన నరనాథగణముతో
వానిజంపవలె గదా నిరస్త

బాంధవుండనైన భాగ్యము భోగ్యమై
బరగు టెట్లునాకు పంకజాక్ష. 63

క॥ అదిగాక కులక్షయమున
బాదలెడు దోషంబు నన్ను బోవిడుచునె దు
ర్మదసత్వదనుజభంజన
కదనమ్మిక సేయజాల కంసారాతీ. 64

వ॥ కౌరవులనఁ లోభోపహతమానసులగుటచేతఁ కులక్షయజనితోగ్ర కల్మషంబుగాని మిత్రద్రోహజనిత కల్మషంబుగాని చూచువారు కారు. మనమట్టి దోషంబుల నెఱింగి యీపాపమునుండి మరలుట కేల ప్రయత్నింపరాదో దెల్పు మదిగాక కులముక్షీణించిన పూర్వమునుండి వచ్చు ధర్మములు నశించును. ధర్మనాశనమైన కులమంతయు నధర్మముతో నిండియుండును.

గీ॥ కంజదళనేత్ర ధర్మసంకరముగాఁగ
జెడుదురు కులాంగనలు వారు జెడినమీద
వర్ణసంకరమగునట్టి వర్ణసంక
రమ్ము జేసిన మాకు పాపమ్ము దొడరు. 66

వ॥ పితృదేవతలు పిండోదక క్రియలు లేనివారై యధోలోకమునకు బోవుదురుగదా కులక్షయకారకులు నరకమును బొందుదురని విందు మక్కటా పాపమనక రాజ్యమునందాసచేఁ మనవారినెల్లర జంపుటకు నూహించుచుంటిమని వాసవి యిట్లనియె. 67

గీ॥ తగవు బోవిడి నన్ను గాంధారి సుతులు
చంపవచ్చినఁ రణమేను సల్పజాల
ననుచు శరమెక్కు బెట్టిన యట్టిచాప
మరదమున వైచి కూర్చుండె నర్జునుండు. 68

---

## ద్వితీయాధ్యాయము.

### సాంఖ్యయోగం

వ॥ అంత యుద్ధవిరక్తుడైన వాసవికి వాసుదేవుం డిట్లనియె.

ఉ॥ పామరజాలసేవ్య మపవర్గవిదూరము దుష్టకీర్తికిన్

ధామము మోహమెట్లు నినుదాఁకెనో సురరాజపుత్రకా
నీమదిలోన క్లైబ్యమును నీచతరంబగు దుర్బలత్వముఁ
సోమకులాబ్ధిచంద్ర విడి శూరులుమెచ్చ రణంబుసేయుమా. 70

వ॥ అనిన పార్థుం డిట్లనియె.

గీ॥ పూజ్యులగు ద్రోణభీష్ములఁ బోరగెల్చి
కొనెడి రక్తాన్నమునకన్న వనజనాభ
దురమొనర్పుటమాని యీ ధరణియందు
దిరిగి భిక్షాన్నమెత్తుట పరమసుఖము. 72

వ॥ దేవా జయాపజయంబులు నిర్ణయింప శక్తుండు నరుండుగామి ని
క్కంబు ధార్తరాష్ట్రుల గూల్చినపిదప సుఖంబనుభవించుట
మాకులేదని కవ్వడి యిట్లనియె. 73

గీ॥ కఠిన కార్పణ్యజనిత దుష్కరమహోగ్ర
దురితచిత్తుండనై తి నిత్తఱుణమునను
నాకుగురుడవు నీవెకాన న్నొకుంద
తథ్యముగఁ దెల్పునాకు కర్తవ్యమేమి. 74

గీ॥ అరయ నిష్కంటకంబు రాజ్యంబుగాని
కడకు దేవాధిపత్యము గాని ప్రాప్త
మైన నింద్రియపటలమ్ము నలమటింప
జేయుదుఃఖము బోకార్ప జేయదెద్ది. 75

గీ॥ బాణములచేత నరుల తాపంబు పాలు
చేయుకవ్వడియిటుల వచించియూర
కున్న వసుదేవపుత్రుడా వెన్నుడతని
తోడ వచియించె నగుమోముతోడ నపుడు. 76

క॥ ఎరుకగలవారి తెరగున
భరతకులాంభోధిచంద్ర పల్కుచుంటివా
సురనదిపుత్రుడు మొదల్గుగ
బరగిన వారలకు వగవ బనిలేదుసుమా. 77

గీ॥ పండితుండైనవాడెప్పు బరమనీతి
చేతనమ్మున్న వారికి జేతనమ్ము
దొలగువారికి వగవడో చెలిమికాడ

కల తెరంగెల్ల వినుము ముఖ్యమ్ముగాను. 78

గీ॥ అరయఁ బరమాత్ముఁడన్న నేనగుదుఁ బార్థ
నాకు దొడరంగబోదు సూ నాశనంబు
నీకునుఁ లేదు యీనృపా నీకమునకు
లేదు యీగాత్రములు బాయుమీద మనము
మెలగుచుండెడివారమే మిత్రమౌళి. 79

గీ॥ అరయ స్థూలశరీరమం దాత్మకెన్న
బాల్య యవ్వన వృద్ధతల్ ప్రాప్తమైన
చందమున నీశరీర నాశంబునొంద
గలదు దానికి గాత్రమ్ము దెలిసికొమ్ము. 80

సీ॥ మిత్రమా పంచతన్మాత్రలవలనఁ జ
నించిన దింద్రియపంచకమ్ము
నరయ తదీయేంద్రియములకు స్పర్శాది
సంయోగమునఁ జేసి సంభవించు
సౌఖ్యమ్ము దుఃఖమ్ము చలిమహోష్ణమ్మును
మొదలైన యాద్వంద్వములు దలంప
నట్టి ద్వంద్వమ్ము లెల్లప్పుడుండకవచ్చు
చుండును మఱిబోవుచుండునుమ్ము

గీ॥ కానవయ్యవి స్థిరములుగావు ద్వంద్వ
ముల సమానంబుగా జూడగల మహాత్ము
డతఁడు పరిపూర్ణమానసుఁ డతఁడుగాంచు
నవ్యకైవల్యసంతతానందపదము. 81

గీ॥ గాత్రమునకెన్న నాశము గలుగుచుండు
గాని యాత్మకు నాశమ్ము గలుగబోదు
తత్వవిజ్ఞాతలీ తారతమ్యముల నె
ఱింగి వర్ణించుచుంద్రు కిరీటి వినుము. 82

సీ॥ సఖుడయే తత్ప్రపంచవ్యాప్తమై సదా
బరగు నాత్మకునెందు చెరుపులేదు
పరమాత్మచే నెప్డు ప్రభవించు నీశరీ
రమ్ములు క్షణభంగురములుగాని

పరికింప నాత్మకు పరిమితకాలమ్ము
లేదు సంభవమనలేదు కొన్ని
దినములకునొప్పదు దినమునకొకరీతి
మారదు గాత్రము మారుచున్న
గీ॥ మారదెప్పుడుఁ దనతీరు మార్పుబోదు
కడు పురాతనమైన దిక్కరణి దెలిసి
బ్రహ్మవేత్తలు జరియింత్రు పార్థ కాన
సంగరము సేయు నేటికి సందియమ్ము. 83
చ॥ అనయము నిత్యమైనదని యవ్యయమైనదటంచు సంభవం
బును మరి నాశనంబెఱుఁగబోదని యాపరమాత్మ నెవ్వఁడే
మనుజుఁడెఱింగె నేనెటుల మారణమెవ్వని జేయునాతఁడో
యనఘ శరీరముఁ విడిన నాత్మ మరొక్కఁడు దాల్చుగాత్రమున్.
గీ॥ సఖుఁడ మనుజుఁడు జీర్ణవస్త్రమ్ముఁ విడచి
నూతనాంబరముఁ దాల్చురీతి యాత్మ
దాల్చుచుండును జీర్ణగాత్రమ్ము విడచి
నూత్నగాత్రమ్ము కుంతీతనూజ వింటె. 85
గీ॥ దహనుఁడు దహింపలేడు శస్త్రమ్ములేని
దలపఁ బేధింపఁజాలవా జలకణములు
దడుపనేరవు గాడుపుఁదగిలి నీర
సమ్ముగా జేయనోపదు సత్యమాత్మ.
నెటుల జంపంగనగు నిర్జరేంద్రతనయ. 86
సీ॥ పరికింపబడ దాత్మ పార్థ కన్గవచేత
నింద్రియవ్రజమున కెఱుకబడదు
చిత్తముచేతఁ యోజింపగాఁబడదాత్మ
కారయఁ వికృతి లేదంద్రుబుధులు
కావున నాత్మ యీకరణిదటంచు సం
గర మొనర్పుము చెలికాఁడ నేడు
కాక నీవెల్లప్డు కలుఁగుచు బాలిసెడు
తనువు నాత్మయటంచు దలచెదేనిఁ
గీ॥ దానికిఁ విచారమున్సేయదగదు నీకు

నంబునన్ బుట్టినవియెల్లఁ నాశమందు
నాశనంబైనయవి జననంబునొందు
దానిదొలగింపఁ నీసాధ్యమౌనె విజయ. 87
గీ॥ జననమృత్యు స్థితిలయ మెఱుఁగనివి గావె
తలఁప దేహాదులైన భూతలములు పార్థ
యట్టి భూతాళికొరకు నీయంతరంగ 88
మునఁ విచారముఁసేయగాఁ జనునె చెప్పుమ.
గీ॥ అవ్యయంబైనయట్టి యీయాత్మనొకఁడు
చిత్రముగఁ జెప్పు నొక్కఁడు చిత్రముగను
గాంచు నొక్కఁడు వినుచుండు గాని యాత్మ 89
నెఱుఁగజాలరు వారెవ్వరిట్టి దనుచు.
గీ॥ చంపదగనట్టి దాత్మయోజింపఁగాన
పార్థ భీష్మాదులకు నీవు వగవదగదు
వారికొరకేల నేభూతవారమునకు 90
వగవఁ బనిలేదు నీకు భావంబునందు.
సీ॥ కమనీయనాక ముఖద్వారమునఁ గవా
టమ్మొగి దెరుచుచందమ్ముగాను
యాదృచ్ఛికమ్ముగా నలవడునట్టి దు
రమ్ము లభించుట రాజులకును
పరమసౌఖ్యమ్మట్టి దురమొనరింపకఁ
ధర్మయశోహాని దవిలి నార
కమ్ము జెందకు ముభూతమ్ములు నీశాశ్వ
తాపకీర్తిని ప్రపంచాంతరమున
గీ॥ జెప్పికొనుచుందురిదినీకు శ్రేయమగునె
వెలయఁ లోకాళిచేఁ గౌరవింపఁబడిన
చతురమానసునకు దుర్యశమునకన్న 91
మరణమే లెస్సయౌ పురందరకుమార
సీ॥ విజయనీవీరణ విముఖుండవైనచో
నిన్ని మహారథానీకమెల్ల
బిఱికివానిగ గణింతురు మున్ను నిన్ను నం

భావించువారె నీపౌరుషమ్ము
దేలికపరుతురు తెలియుము పరిపంథి
పటలమ్ము చేదూరంబడు నమనీవు
కావునం లెమ్ము సంగరమొనర్పుము వైరి
గెలిచి గైకొనుము భూతలముం గాక

గీ॥ వైరిచేంగూలి కనుమపవర్గసుఖము
జయమపజయమ్ము దుఃఖమ్ము సౌఖ్యమాది
గలుగు ద్వంద్వమ్ములను సరిగాదలంచి
యాహవము సేయనిపుడాయత్తమగుము
దీనదురితమ్ము నీకు సుంతేనిలేదు. 92

గీ॥ ఆత్మతత్వము దెల్పితి నయ్య యింక
కర్మబంధములూడ్చు యోగమ్ము వినుము
దానిజేయుచు మానిన దరనరదఘము
భయము సంసారబంధము బాపునదియె. 93

గీ॥ ఇట్టియోగమ్మునకు చలియింపనట్టి
బుద్ధియే కారణమ్మట్టి బుద్ధిలేని
వారు కర్మములన్సదా వదలకుంద్రు
సాంద్రసుగుణాభినుత దివిజేంద్ర తనయ. 93

సీ॥ స్వర్గేతరములైన సౌఖ్యముల్లేవని
వేదార్థములయందు వాదములను
కోర్కులుగలుగు మూర్ఖులుపూచుతీవల
వలె మధురమ్ములై స్వర్గఫలము
గలిగించునట్టి మాటలనమ్మి యాసుఖా
నంతరమందు జన్మములు గర్మ
ఫలములు గలిగించు బహుళతరైశ్వర్య
పదములువాంఛించి పలుకుచుందు

గీ॥ అట్టివారికి జలియింపనట్టి బుద్ధి
కలుగదు సమాధియందు నిక్కముగాను
దాన శాశ్వతమోక్షపదంబులేదు
ఖాండజితవైరిచయగాత్రి పాండుపుత్ర. 94

గీ॥ ఎట్టిగుణ మెట్టివానికి బుట్టుచుండు
నట్టిగుణమునకనుకూల మైనఫలము
వేదములొసంగుగాన సాత్వికగుణంబుఁ
బూనికామము విడిచి సుజ్ఞానివగుము. 95

గీ॥ నిండి యుండినచెరువున నీరుతనకు
వలసినంతయె గొనునట్టి వానిపగిది
ధరణిసురుఁడైన వాఁడు వేదములదనకు
వలసిన ప్రయోజనము గొనవలయుసఖుఁడ. 96

గీ॥ అర్జునానిత్య నైమిత్తి కాదికర్మ
ఫలములన్గోర్చి కొనకాధిపత్యమీవు
కర్మములుమాత్రమెపుడు ముఖ్యమ్ముగాను
సలుపుచుండుముపార్థ నిశ్చలతనీవు. 97

గీ॥ ద్వంద్వములను సమానచిత్తమున దలఁచి
ఫలముల న్గోరకేకర్మముల నొనర్చు
యోగమన బడుగాన నీయుల్లమునను
కామములువీడి సేయుమా కర్తచయము. 98

గీ॥ కామ్యకర్తంబు లొనరింప గలమనుష్యు
లుల్పులటుగాన పార్థనీ యంతరంగ
సీమసమముగఁ జూచు మశేష యుగళ
చయముదాన శుభంబు బొనంగునీకు. 99

గీ॥ బుధులు ఫలములరోసి యెప్పుడు వినీతి
గర్మముల నాచరింపుచుఁ గ్రడగి తమన
జన్మబంధమ్ములన్బాసి సంకటమ్ము
దొలగు నెలవున కేగుచుందురు నిజముగ 100

గీ॥ సఖుఁడ దేహాభిమాన కష్టంబునీకు
వదలినప్పుడె వైరాగ్యపదవి దొరకు
నరయ వేదాంతవాక్యము లాలకింప
లతిచంచలిపని సద్బుద్ధి గలిగెనేని
గలుగుబోమిత్ర యిట్టి యోగంబునీకు. 101

వ॥ అనినఁ బార్థుండిట్లనియె 102

గీ॥ దేవవచియింపుమా సమాధి న్జలింప
కుండునట్టిమహాత్ముడెట్లుండతండు
నడచుటేరీతి యాతని నుడువులెట్లు
తెల్పుమాతడు కూర్చుండు మెలకువెట్లు 103
వ॥ అనిన హరి యిట్లనియె
గీ॥ కడుభయమ్మును గినుకరాగమ్ములేక
సౌఖ్యముండిన నెట్టివాంఛలునులేక
తన విచారమునకు నెగ్గుల్దాల్పంబోక
యుండునాతండు కడు నిశ్చలుండు పార్థ. 105
వ॥ అని పలికి పార్థా తన యాత్మయందే తన్ను నానందింపజేయు చి
త్తమునుబొంది వేధించు కోర్కెలు వీడువాడుస్థితప్రజ్ఞడని మ
రియు నిట్లనియె. 106
గీ॥ జ్ఞానియగువాడు కూర్మము స్వాంగములను
లోనికిన్దీసికొనినటు బూని యింద్రి
యములఁ లోనుగజేసి నెయ్యమ్ముమీర
నిశ్చలుండగు సద్గుణ నిచయ విజయ. 107
గీ॥ ఇంద్రియమ్ములనెల్ల జయించువాడు
నాయెడన్ గోర్కెగల యోగినాధుడౌను
వాడె నిశ్చల చిత్తుడై వరలుచుండు
వాడు నను జెందునో చెలికాడ వినుము. 108
గీ॥ చిత్స్వరూపంబు బ్రహ్మము జెందగోరు
స్థిరతరంబైన చిత్త మింద్రియచయంబు
వలన నాహ్వానముఁ జేయబడు పార్థ
కాన నిలకడవలయు నిక్కమ్ముగాను. 109
సీ॥ వాంఛగల్గినవానిఁ వదలదును సంగమ్ము
సంగాభిలాష బొసంగు గినుక
కినకచే నవివేకమునుబుట్టు నవివేక
వశమున జ్ఞానము వమ్మునగును
జ్ఞానవాశమున నాశనమందు బుద్ధియు
నటమీద తానాశమందు పార్థ.

కావున విషయసంకలితుఁడై సుజ్ఞాని
　　　　　　చరియింపకుండు నిశ్చయముగాను
గీ॥ ద్వేషమును రాగమెడల నింద్రియచయమును
గెలిచి విషయాళిజెందిన కీర్తిశాలి
కలవడు నైర్మల్యమంత శోకాదులడగు
సఖుడ వానికి బుద్ధినిశ్చలతగలుగు. 110
గీ॥ ఎలమి విషయాభిలాషచే నింద్రియములు
పోవునప్పుడు తనచిత్తమును విడచిన
వడవ జలములముంచిన పవనుమాడ్కి
నతని ప్రజ్ఞ నుమాయించునయ్యపార్థ. 111
గీ॥ అన్నిరీతుల సర్వేంద్రియవ్రజమును
కోరికలనుండి తప్పించి ధీరుడగుచు
వశ్యముగజేసికొన్నట్టి వాడునిశ్చ
లుండు నాజనునెప్పుడు బాండుపుత్ర. 112
గీ॥ జ్ఞానమెఱుగని భూతవ్రజమ్ములెల్ల
నిదురజెందిన మేల్కాను నిఖలభూత
చయముమేల్కాన నిదురించు జ్ఞానియైన
వాడు నిక్కమ్ముగా సంగడీడ పార్థ. 113
వ॥ యింతకును జ్ఞానము గొప్పదని హరి మఱియు నరున కిట్లనియె.
సీ॥ వారిధిలో నీరుజేరు విధమ్మున
　　　　　　శాంతుడౌ సుజ్ఞానవంతువికృతి
బొందింపకుండనెప్పుడు వాంఛలున్ ప్రవే
　　　　　　శించునో యాతఁడు చిత్తశాంతి
గాంచును విషయసంకలితుడై జరియించు
　　　　　　జనుడుగానడు మనశ్శాంతి పార్థ
కావునఁ గోర్కెల గడద్రోచి స్పృహవీడి
　　　　　　వెలయు నహంకృతి విడచి సతము
గీ॥ కోపమున్వీడి మోహముఁ గూలఁజేసి
స్థిరత నామరణాంతంబు బఱగునతడు
ప్రకటితంబగు కైవల్యభవ్యసుఖము

గాంచు కౌన్తేయ విక్రమకార్తికేయ. 116

---

## తృతీయాధ్యాయము.

### — కర్మయోగం —

వ॥ అనిన పార్థుండిట్లనియె.

గీ॥ అకటకట జ్ఞానమే గొప్పదనుచు నాకు
స్థిరతరంబగు కరుణబోధించి యిట్టి
ఘోరకర్మమునకు పురికొల్పనేల
సితపయోజదళాక్ష నిర్జితవిపక్ష. 117

వ॥ అదియునుగాక

గీ॥ రక్కసుల గొంగ నీవిపుడొక్కదాని
నొక్కటపవాదముగ దెల్పి యుల్లమునకు
నొదవలేనట్టి మోహము గొల్పెదేమి
జ్ఞానమున కర్మమునను మేలైనదెద్ది
నావుడున్ బార్థునకు పద్మనాభుడనియె. 118

వ॥ నేనింతకుమున్ను కర్మజ్ఞాన నిష్ఠల తెఱంగెఱింగించితి నందునాత్మ
జ్ఞానము గలిగిన సాంఖ్యులు సుజ్ఞానప్రధానులు యోగులు కర్మ
ముల నొనర్చుచుండవలయును కర్మము లొనర్పనివాని కాత్మ
నిష్ఠకుదురుట దుర్లభంబని మఱియు నిట్లనియె. 119

గీ॥ మాయచే జన్మమందును మానవుండు
దాన త్రిగుణమ్ములకును స్వాధీనుడగును
కాన నెవడేని యొకత్రుటికాలమేని
కర్మములజేయకుండ డో నిర్మలాత్మ. 120

గీ॥ చిత్తమున నింద్రియార్థముల్ జెందగోరి
యెపుడుకరమాదిగల్గు కర్మేంద్రియముల
కార్యములుసేయుటకు నియోగమ్ముసేయు
వాడు డాంబికుడ వివేకి వాడె పార్థ. 121

గీ॥ చిత్తమున నింద్రియముల భంజించి ఫలము
వదలి కర్మేంద్రియముల నెవ్వండుకర్మ
ములనొనర్చునో వాడుత్తముండు పైన

విశదముగ దెల్పినట్టి డాంబికునకన్న. 122
సీ॥ కానఫలమ్ముల మానసమ్మునరోసి
కర్మములజ్ఞేయ గడగుమయ్య
కర్మములనయజ్ఞ కాంక్షచేఁజేయుమా
ఫలముల గాంక్షింపవలదు మనుజు
డన్యకర్మమ్ముల నాచరింపగజన్మ
బంధమ్ములఁ దగుల్పడుటధృవము
యజ్ఞకర్మమ్ముల యందలివేల్పుల
దృప్తిబొందించిన దిరిగివారు
గీ॥ దృప్తిబొందింపుచుందురు దీర్ఘకరుణ
యజ్ఞశేషమ్మదిదినినట్టి విజ్ఞులెల్ల
దురితముల నెల్లబాయు చుందురుధృవముగ
ధర్మమార్గానుసారి విదారితారి 123
వ॥ మరియువేల్పులకు గాకతమకొరకు పాకంబుచేసికొనినవారికి
పాపంబుసంభవించును కారణంబేమంటేని 124
ఉ॥ భూతచయంబులన్నమున బుట్టుబడంపడియన్నమంబుద
వ్రాతమువల్లబుట్టెమరి వారిదసచయమన్న యాగసం
జాతములట్టియాగములు సత్యముకర్మములన్నెలంగువి
ఖ్యాతములట్టికర్మములు గల్గునువేదముఖోదితమ్ములై 125
వ॥ అట్టివేదంబులు పరమేశ్వరుని వలనఁ బొడమునుగాన
దేవార్థమ్మగా యజ్ఞములు కర్తవ్యములుఁ 127
సీ॥ సంగడీడాజ గచ్చక్రమీయది భగ
వంతునిచే నడుపంగబడును
కానఁదానిఁ బ్రీతిగానెంచి వర్తింప
నట్టివాడెన్న పాపాత్ముడగును
వాడింద్రియాళికి వశ్యుండువాని జీ
వనమెల్ల నిజముగా వ్యర్థమగును
స్వీయాత్మచే దృప్తిఁజెందిన నరునకు
కర్మముల్సేయ నక్కరయెలేదు
గీ॥ కవ్వడీ యట్టివారలే కర్మములను

చేయ ఫలమేమిలేదటు చేయకున్న
గలుగునష్టమ్ములేదు నిక్కమ్ముగాను
కలతెరంగెల్ల దెలిపెద దెలియవినుము. 128
క॥ జనకుడు మొదలగు వారలు
దినదినమును కర్మచయ మతిప్రముదముచే
నొనరించి ముక్తిజెందిరి
జననుతనీవట్లుసేయజను గర్మములన్. 129
వ॥ కానఫలంబుల నపేక్షింపక గర్మంబుల నొనర్చుటమేలు 130
గీ॥ చెలగియుత్తముడే కర్మముల నొనర్చు
దేనినిప్రమాణముగ దాను దీసికొనునో
తక్కువారట్టి కర్మతంత్రములొనర్చి
తత్ప్రమాణమె గొనుచుంద్రు తథ్యముగను. 131
గీ॥ కవ్వడీనేను మూడులోకముల యందు
నించుకనొనర్ప వలసిన దెద్దిలేదు
పొందరానిది లేదింక పొందదగిన
దెద్దిలేదైన కర్మము లిప్పటికిని
చేయుచుంటిని కౌన్తేయ యసిగ్ధేయ 132
సీ॥ అరయనొకవేళ నేననాయాసముగను
కర్మములుసేయకున్న లోకమ్మువార
లన్నివిధముల నాదారి ననుసరించి
మెలగుదురుకాన కర్మముల్సలుపువాడ. 133
గీ॥ కర్మములు నేనుమాన లోకమ్మువారు
సంకరులుగారె ధృవముగా సవ్యసాచి
కానలోకులనెల్ల సంకరుల జేయ
నిచ్చలేకుంట కర్మము లేనొనర్తు 134
గీ॥ భారతాగ్రణియీకర్మ ఫలములందు
నిచ్చగలిగినయజ్ఞాను లెట్లొ జ్ఞాని
చయముకర్మాళి యెడల నిచ్చనుత్యజించి
లౌకికంబుగ కర్మముల న్జరింత్రు 135
సీ॥ కర్మముల స్ఫలకాంక్ష జేసెడిమూఢు

జ్ఞానిప్రోత్సాహము నలుపుచుండ
వలయునిరుత్సాహ వశునిజేయగరాదు
త్రిగుణమ్ములకును స్వాధీనుడగుచు
గర్మసంచయ మహంకారమ్ముచేత న
జ్ఞానివై నిత్యమునలుపుచుంటి
నేననితలచెడి నిశ్చలేతరునిప్రో
త్సాహమ్ము సేయడే తత్త్వవిదుడు

గీ॥ మఱియుగోవిదుడైనట్టి మానవుండు
కర్మములతీరుగుణవిభాగమ్ము నెఱిగి
యింద్రియమ్ములె విషయాళి కిచ్చ జెందు
నాత్మగారదు విషయాళి యందుసుఖమ
టంచు సక్తుండుగాడు సత్యమ్ముగాను 136

వ॥ అట్లుగావున ప్రకృతియం దాసగలవారికి యాత్మజ్ఞానమెఱింగిన
వాడు బుద్ధిభేదం బొనరింపరాదు. 138

గీ॥ కానఫలకాంక్షయును మమకారమును త్య
జించి కర్మములన్నన్ను జేర్చి సంది
యమ్మువిడి సంగరము సల్పుమయ్య పార్థ
నామతంబాలకించిన నరుడు జెడడు. 139

గీ॥ నామతంబెవరు దెల్పినం దాము వినక
విప్రపీగడువారవివేకమతులు
వారు చెడిపోవుచుందు రవశ్యముగను
వారు మూఢులు సంగ్రామ వీరపార్థ. 140

వ॥ ఎంత జ్ఞానవంతుడైనను తన పురాకృతకర్మము ననుసరించి కర్మ
ము లొనరింపుచుండును మూఢులగువారి వర్తనంబులికం దెల్ప
నేటికి తమతమ ప్రకృతుల కనుకూలంబుగా వర్తించు భూతాళికి
నిగ్రహం బేమిసేయంగలదింద్రియంబులకు శబ్దాదులగు విషయ
సంపర్కంబునన్ జేసి కామాదులు గలుగుచుండును. నిర్జితేంద్రి
యులు కామాదులకు చిక్కరు. కామాదులే జ్ఞాననాశమున
నకు కారణములు. 141

గీ॥ జ్ఞానసంపన్నునకు నిత్యశత్రువులన

బరగురాగంబు ద్వేషంబు పార్థ కాన
వానికిఁ జిక్కడేంను సుజ్ఞానియైన
వాడుతన సాధ్యమైనంత వరకుధృవము. 142

గీ॥ బాగుగా నాచరింపగా బడిన యితర
ధర్మమునకన్న గుణహీనధర్మమైన
స్వీయధర్మమ్మెలెస్స నిషిద్ధ మితర
ధర్మమద్దానఁ నరుడు పాతకము జెంకు. 143

వ॥ అనిన పురుషోత్తమా పురుషుఁడు తన కిష్టములేకున్నను బలత్కా-
రముగా దేనిచేత నియోగింపబడి పాపములాచరించునో దెల్పు
మన హరి యిట్లనియె. 144

గీ॥ సవ్యసాచీ రజోగుణ జనితమైన
కామమేక్రోధముగ మారగలదు దాని
కెంతవరకును తృప్తిలే దిట్టికామ
మల్లసంసారమున శత్రువనుచునమ్ము. 145

గీ॥ అద్దమున ధూళిధూమమాయగ్ని యడల
నుదరమధ్యమ్మునను జరాయువు జెలంగు
కరణిగా జ్ఞానమున్నదా కామమావ
రించి యున్నది దెలియు మీరీతి సఖుడ. 146

గీ॥ కాంక్షలే స్వీయరూపమ్ముగాఁగ లట్టి
కామమెప్పుడు వీడదు జ్ఞానమును వ
రంతపాజ్ఞానమునకుఁ దురంతమైన
కామ మరి దానిగెల్వఁ శక్యమ్ముగాదు. 147

గీ॥ మదిని బుద్ధీంద్రియమ్ములఁ బొదలునట్టి
కోరికలు జ్ఞానముజుట్టుకొనుచు నిత్య
మెట్టిపూరుషునేని సర్వేంద్రియముల
చేతఁ మోహనిమగ్నునిఁ జేయుచుండు. 148

గీ॥ అరయ నింద్రియములఁ వశపఱచి శుభమొ
సంగు జ్ఞానముఁబొపు వాంఛల త్యజింపు
మందుచే నీకు మంగళమ్మమరుచుండు
గాలకేయాది రాక్షసకాల పార్థ. 149

సీ॥ తతబుద్ధివినుము గాత్రమ్మునకన్న నిం
ద్రియపాళి యెక్కుడై దేజరిల్లు
నింద్రియమ్ములకన్న నెక్కుడు చిత్తమ్ము
చిత్తమ్మునకును బ్రసిద్ధిబుద్ధి
బుద్ధికిమిన్నయై బొలుపొందునయ్యాత్మ
యనిజ్ఞానసంపన్నులాడుచుంద్రు
కావుననాత్మ యీకరణిదటంచుము
ఖ్యమ్ముగానెఱింగిసుజ్ఞానమునను
గీ॥ బుద్ధిచేనింద్రియావళి పొగరడంచి
కడువిచారమ్ము బుట్టించు కామరూప
మైనపరిపంధి విడువమేలౌనునీకు
భంజితామిత్ర సముదాయ పాండవేయ. 150

——

చతుర్థోఽధ్యాయము.

—। జ్ఞానయోగము ।—

మ॥ ఎలమిన్ సృష్టికినాదిసూర్యునకు నేనీయోగమున్ దెల్పితిన్
జలజాప్తుండ వలన్వచించెమనువన్ జక్రేశ్వరున్గూర్చిని
శ్చలచిత్తుండతఁడావలన్ దెలిపెనీక్ష్వాకుండు. నామేటిక
వ్వలఁ రాజర్షులెఱింగిరీక్రమము పూర్వంబియ్యదో యర్జునా. 151
గీ॥ చాలకాలమునన్ బ్రశస్తతనుగాంచిఁ
నట్టి యీయాత్మవిద్య నిన్నాప్తుడనుచుఁ
శిష్యుఁడనీయెంచి నేనిప్డు జెప్పినాఁడ
దీని దెలియుము మిగుల మేలైన దరయ. 152
వ॥ అంత గాంతేయుఁ డతని కిట్లనియె.
గీ॥ ముందుబుట్టిన రవికి గోవిందనీవు
వెనుకజన్మించి యీయాత్మవిద్య యతని
కెటుల దెల్పితివో యిందిరేశనాకు
దెలిపి బాపగదయ్య సందేహ మిపుడు. 154
వ॥ అనిన నరునకా హరియిట్లనియె.
గీ॥ కవ్వడీ నీవెఱుంగవు గానినీకు

నాకు గతియించె బెక్కుజన్మములు మున్ను
సర్వమెఱుఁగుదు నోసవ్యసాచినాకు
దెలియకున్నట్టి వెయ్యడగలవు చెపుమ. 155

గీ॥ అజుఁడనై యవ్యయాత్ముఁ డనగుచు భూత
విభుఁడనై స్వీయమాయచే విజయనేను
సంభవింపుచునుంటి నిశ్చయముగాను
ధర్మమున కంతరాయము దగులునపుడ
ధర్మమునకెన్న వృద్ధియై దనరు నపుడు. 156

గీ॥ చెలగి ధర్మముల్ బ్రతిష్ఠింప సాధు
జనుల పోషింప దుష్టుల సంహరింప
బుట్టుచుందును ప్రతియుగంబు నను నేను
నిర్జిత నివాతకవచ నిర్ణిద్రకవచ. 157

సీ॥ నాదుజన్మంబును నాదుకర్మంబు ధృ
వంబుగా నెఱిగినవాఁడు మరల
దిరిగి పుట్టక నస్మదీయ తేజంబున
గలయుట నిజము రాగమ్ము భయము
గోపమ్ముఁ వీడి మనఃశోశనమ్మునన్ ప్రపం
చమ్ము నామయమని సంతతమ్ము
జ్ఞానతపోరూఢి సజ్జనుల్ పలువు రె
ఱింగి పొందిరి నన్నిరీటివినుమి

గీ॥ కేవిధమ్మునఁ నన్నాశ్రయించి జనులు
వెలయుచుందురో వారి నావిధముగాను
కరుణగాంచెద మనుజులెక్కరణి గర్మ
ములనొనర్చిన నాబాట మెలగుచుంద్రు. 158

గీ॥ ఇహమునన్ గర్మఫలముల కిచ్చ జెంది
మదినిఁ జేజేల గొల్చి గర్మములవలనఁ
గలుగు ఫలములు త్వరలోన గాంచుచుంద్రు
మనుజులో పాండుపుత్ర నిర్మలచరిత్ర. 159

గీ॥ కర్మముల గుణముల న్విభాగములఁ జేసి
క్షితినిఁ జాతులఁ నాల్గు సృష్టించినాఁడ

మఱియు నవ్వారిచేతఁ గర్మములఁ గర్త
నగుచు జేయింపుచుంటినే నవ్యయుండ
గాన కర్మములంట వెక్కరణినన్ను. 160

గీ॥ నన్ను కర్మములంటవు నాకుఁగర్మ
ఫలములందిచ్చ సుంతేనిఁ గలిగియుండ
దిట్టివాఁడని నిన్నెవ్వఁడెఱిగియున్న
వాఁడు కర్మములన్ బట్టువడఁడు పార్థ. 161

గీ॥ పూర్వులీతీరెఱింగియు మోక్షమంద
గోరి కర్మముల జ్జేసినారుగాన
నర్జునా వారిమతము నీవనుసరించి
కర్మము లొనర్పుమయ్య ముఖ్యమ్ముగాను. 162

సీ॥ సర్వజ్ఞులేని సంశయమందుచుంద్రు క
ర్మాకర్మములఁ గూర్చి నీకు నేను
వివరింతు సంసారవిముఖులుగాఁజేయ
గలిగి శాస్త్రములకు కడుహితమ్మ
గలిగిన కర్మము దెలియగా దగినది
కర్తవ్యమగునట్టి కర్మమనియ
కర్మమ్మువినుమది కర్తవ్యమనఁగాదు
భవబంధమయ్యది బాపలేదు

గీ॥ శాస్త్రసమ్మతమదిగాదు సవ్యసాచి
కర్మమందిచ్చలేక లోకమ్మమెచ్చ
గర్మములు చేయుచున్నట్టి ఘనుడు యోగి
వాఁడె సుజ్ఞాని ధర్మతత్పరుఁడు పార్థ. 163

గీ॥ కార్యములయందుఁ గామసంకల్పమును త్య
జించి జ్ఞానాగ్ని వాంఛ భస్మీకరించి
తనరువానిని పండితోత్తముడటంచు
బలుకుచుందురు పండితుల్ పాండుపుత్ర. 164

గీ॥ వినుము పూర్వోదితజ్ఞానమునఁ మరెవ్వఁ
డనవరతము నిరాశ్రయుండగుచు నిత్య
తృప్తుడై కర్మఫలములం దాసవదలి

కర్మములు జేయుచున్నట్టి ఘనుని బుధులు
కర్మవిరహితుఁడండ్రు నిక్కముగఁ బార్థ. 165

గీ॥ కాంక్షలన్నీడి యింద్రియగణముగెల్చి
నిరభిమానంబుగా బంధవిరహితముగ
గర్మములు దేహయాత్రకుగాఁ నొనర్చు
వానికఘమేని పుణ్యముగానిలేదు. 166

గీ॥ ప్రాప్తమేమైన నది మహాభాగ్యమనుచు
ద్వంద్వములను సమానచిత్తమున గనుచు
నొక్కవిధమైన పూన్కితో నున్నవాఁడు
కర్మముల నాచరించియుఁ గట్టుబడఁడు
పార్థ సాంసారికములగు బంధములకు. 167

సీ॥ వాంఛల నన్నింటిఁ వదలిధర్మాధర్మ
బంధమ్ములకు దగుల్పడకఁ జ్ఞాన
మందు చిత్తమునఁ యజ్ఞార్థమ్ము నొనరించు
నాతని కర్మము లడగుచుండు
బ్రహ్మంబు హోమంబు పాత్రమ్ము బ్రహ్మము
బ్రహ్మమగ్నిహవిస్సు బ్రహ్మమరయ
గర్త బ్రహ్మంబని కర్మమ్మునందు జ
లింపనివాఁడు యోజింపగాను

గీ॥ బ్రహ్మమునొందు ధృవముగా బాండుపుత్ర
కర్మయోగులు తత్ఫలకాంక్షచేతఁ
జేయుదురు యజ్ఞములను జేజేలగొల్చి
బ్రహ్మవేత్తలుజేసెడి పగిదివినుము. 168

గీ॥ సరళిమీరంగఁ బ్రహ్మతేజమున నాత్మ
జేర్చుటయె యజ్ఞమనుచు వచింపుచుందు
రింకనైష్ఠికులైన వారెల్ల అరయ
జేసెడి విధానమిపుడు వచింతు వినుము. 169

గీ॥ అరయ గర్ణేంద్రియము మొదలైన యింద్రి
యములఁ నిగ్రహమనెడి ఘోరానలమున
వేల్చుచున్నారు నైష్ఠిక వితతివిజయ

వేల్చుచున్నారు శబ్దాదివిషయములను
గొందఱింద్రియవహ్నుల యందుజేర్చి. 170

వ॥ మఱియుఁగొందఱు ప్రాణాదివాయు సంచార చాంచల్యములను
జ్ఞానాగ్నియందు వేల్చుచుండిరింక మఱిగొందఱు 171

సీ॥ యాచకావళికి ద్రవ్యంబిచ్చుటయు దపం
బాచరించుటయుఁ యోగాభ్యాసనము
నియమితహారులై నిఖిలేంద్రియవికార
ముల నడంచుట వ్రతమ్ములు సలుపుట
శాస్త్రమ్ములెల్లను జదువుటఁ వేదపా
రాయణమ్ముతి శ్రద్ధజేయుటయును
దలపోయుచుంద్రు దత్తత్కర్మముల జేయు
కర్తలు యజ్ఞాళిగా కిరీటి

గీ॥ వారలెల్లఱు గలుషముల్ వమ్ముజేసి
కొనినవారలె నరకము గనమిథ్యవము
వారికిఁ దదీయఫలములు వరలుచుండు
నిర్జితామిత్ర నిచయగాండీవపాణి. 172

వ॥ కొందఱు పూరకమను ప్రాణాయామంబును కుంభకప్రాణాయా
మంబును సలుపుచు యజ్ఞములను బుద్ధిచేనుందురు. 173

॥గీ అరయ గొందఱు పరిమితాహారులగుచు
వాయువున వాయువున్గూర్చి భావములను
యజ్ఞమిదియంచు దలఁతురా యజ్ఞకర్త
లెల్లఱున్పాపరహితులే యింద్రపుత్ర 174

గీ॥ పార్థనాచేతనుడు వగాబడినయజ్ఞ
ములనొనర్చియుతచ్ఛేష ములఁభుజించి
పరమమైనసనాతన బ్రహ్మపదముఁ
బడయుచుందురు తన్మఖా భావులకుని
హామ్మెలేదింక పరమ పదమ్ముగలదె 175

గీ॥ వేదములలోనఁ యజ్ఞము ల్వివిధవిధము
లనుచునుడు వంగబడెని వియన్నికర్మ
ములజనించినవని మదిదెలిసి సకల

బంధములనుండి వదలగా బడుముపార్థ 176
గీ॥ తెలియు మర్గముచేత సాధింపదగిన
యజ్ఞములకన్నసుజ్ఞాన యజ్ఞముత్త
మమ్ము కౌన్తేయ యిట్టికర్మములెల్లఁ
మోక్షమునకెన్న సాధనమ్ములుగదయ్య.
గీ॥ సకల తత్వజ్ఞుడైన దేశికునిజేరి
యతనిఁసేవించి బ్రహ్మము నరయజాలు
జ్ఞానమార్జించుమో సవ్యసాచినీవు
దాన నలవడుఁ మోక్షపదమ్ము నీకు. 177
గీ॥ జ్ఞానమననెట్టిదన్ననో సవ్యసాచి
యిట్టిమోహమ్ము మాని నీవెల్లభూత
ములను నాయందు జూడగాగలవు జ్ఞాన
మదియె నమ్ముము నామాట మదిగిరీటి. 178
గీ॥ ఎల్లపాపులకన్న నీవెక్కుడైన
పాపివైనను సుజ్ఞానభావమునను
పాపముదెమల్చి యాపరబ్రహ్మపదము
తథ్యముగ గాంచెదవు సుభద్రాకళత్ర. 179
చ॥ వినగదవయ్య పార్థమది విభ్రమము న్విడి మండువహ్నియిం
ధనములబూదిసేసెడువిధమ్మునఁ జ్ఞానదవానలంబు చ
య్యన నొనరించుఁ గర్మనిచయంబులబూదిగఁ జ్ఞానమేగదా
మనుజునకు న్పవిత్రానము సుమా నరపాలకుమారకోత్తమా. 180
గీ॥ కర్మయోగసమాధియోగములచేత
సంస్కరింపంగబడినీవె చాలకాల
మున కెఱుంగుదు వీజ్ఞానమును కిరీటి
జ్ఞానమునకెద్దిగాదు సమానమరయ. 181
సీ॥ అరయగాఁ బార్థ జ్ఞానాసక్తిచేత నిం
ద్రియములఁ దానుస్వాధీనపఱచు
కొనువాఁడు జ్ఞానముఁగనుగొనుఁ గడుశీఘ్ర
కాలమ్మునను శాంతిగాంచుఁదానఁ
జ్ఞానవిహీనుఁడు శాస్త్రమ్ములను గురు

వాక్యజాలములు ధ్రువంబో కాదో
యనిసంశయంబందునట్టి వాఁడెన్న నా
శము జెందు నెవ్వఁడే సంశయించు

గీ॥ వాఁడిహపరమ్ములకు జెడువాఁడు పార్థ
కానఁ గర్మాళిగడ ద్రోచి జ్ఞానముననుc
సంశయము బాపుకొన్న సంసారబంధ
ములకుజిక్కఁడు దా నిజమ్ముగ గిరీటి. 182

గీ॥ కాననీ బుద్ధియందున జ్ఞానజనిత
మైనసంశయమనుతీవ జ్ఞానమనెడి
ఖడ్గమునగొట్టి సల్పువా కర్మమును దు
ఠమ్ము సేయఁగనికసందియమ్మదేమి. 183

---

పంచమోఽధ్యాయము.

—। కర్మ సన్యాసయోగము ।—

వ॥ అనినఁబౌరందరియిట్లనియె.

ఉ॥ ఇంతకుమున్ను గర్మముల నెల్లత్యజింపుమటంచు బల్కినీ
వింతటిలోన గర్మముల నెల్లనొనర్పుమటంచు రుక్మిణీ
కాంత వచింపుచుంటివిక గర్మము సేయుదు నాత్యజింతునా
స్వాంతములోన గల్గినవిచారము బాపుమటన్న నావుడున్. 184

గీ॥ కర్మములఁ వీడువాడైన గానికర్మ
ములనొనర్చిన వాడేని మోక్షమందు
గానియీరెండు తెఱగుల గర్మములనొ
నర్చుకే పాండుపుత్ర ఘనంబుసుమ్ము. 185

గీ॥ ద్వేషమును రాగమునుమది వీడిద్వంద్వ
ములఁ సమానముగా జూడగలుగు నట్టి
వాఁడు సంసారబంధము వదలువాడు
నిత్యసన్యాసి యాతడే నిశ్చయముగ. 186

గీ॥ కర్మసన్యాస రూపసాంఖ్యమ్ము వేరు
కర్మములు జేయుచున్నట్టిక్రమము వే
రటంచు వచియింపుదురు మందులైనవారు

చెలగి యీరెంటనో కడనుష్ఠించెనేని
గాంచెదరు రెంటిఫలము నిక్కమ్ముగాను. 187

గీ॥ తలఁపఁ సాంఖ్యులుబొందు పథమ్మె యోగి
వరులు పొందుదురో పురందరకుమార
కానఁ సాంఖ్యులుఁ గర్మిష్ఠులైనవారు
సములనుచు నెంచుచుందురు జ్ఞానులెల్ల

గీ॥ కర్మసన్యాసముజ్ఞేయ గష్టతరము
కర్మములొనర్చువాడు శీఘ్రమ్ముగాను
బడయఁగలవాఁడు నిర్గుణబ్రహ్మపదము
మర్దితారాతిసముదాయ మనుజగేయ. 188

గీ॥ పార్థవినుమయ్య నిఖిలప్రపంచమెల్లఁ
శుద్ధతత్వమనోజయ సిద్ధులమరు
నట్టివాఁడెన్నఁ బ్రహ్మమయంబటంచు
దలఁచునాతఁడు కర్మముల్సలుపుచున్న
బట్టుబడఁబోఁడు సంసారబంధములకు. 189

సీ॥ పలుకుటఁ వినుటఁ గన్నులఁగాంచుటాదిగాఁ
గల యింద్రియాళివికారములను
రూఢిగాఁ బ్రహ్మస్వరూపుఁడ నగునేను
చేయుటలేదని చిత్తమునను
దలఁచి కర్మమ్ములు సలుపు సుజ్ఞాని మో
క్షముగాంచుఁ ధృవముగాఁ సవ్యసాచి
యీవిధమ్మునను ఫలేచ్ఛకెవ్వఁడు
కర్మములఁజేయగలఁడో వాని

గీ॥ పాపమంటదు పంకజపత్రమునకు
సలిలకణమంటకున్నట్టిచందమునను
పుణ్యచారిత్రపాండురాట్పుత్రమిత్ర
సందియమువీడి సల్పుమా సంగరమ్ము. 190

మ॥ మమకారంబెడలించి నెమ్మదినఁ గామంబుల్విసర్జించి శు
ద్ధమయంబౌ నిజబుద్ధి నింద్రియపటుత్వంబూడ్చిపోవైచి క
ర్మములన్ జేయుచునుంద్రు యోగులుసమగ్రజ్ఞానులై దాన స

త్వముగాఁ శాంతిజనించుఁ దానవినుమిత్రా మోక్షమున్జేకురున్. 191

గీ॥ వికలచిత్తులు పాడుకోరికలగముల
చేతఁ వేధింపబడి ఫలసిద్ధిఁ జెందఁ
గోరి కర్మిష్ఠులగుచు సంసారబంధ
ములకు జిక్కుదు రియ్యది దెలియుమయ్య. 192

గీ॥ నిర్జితేంద్రియుఁడగు వాఁడు నిఖిల కర్మ
ములను చిత్తమ్మునన్ రోసి మోదముగను
దనరుచుండును యీనవద్వారసహిత
గాత్రమునఁ సవ్యసాచి నిక్కమ్ముగాను. 193

వ॥ పరంతపా భగవంతుఁడు కర్మములఁగాని కర్మఫలములగాని కర్తృత్వమునుగాని లోకమునఁ సృజియించుటలేదు. సత్యముగా నవి యన్నియుఁ బ్రకృతిసంభవములని తెలియుము. మట్టి భగవంతుఁడొకని పాపముగాని పుణ్యముగాని స్వీకరింప డజ్ఞానముచేతఁ జ్ఞానమావరింపబడియున్నది దాన నిఖిలభూతవ్రజము మోహమున మునుగుచున్నయది.

గీ॥ భానుడా యంధకారము బోనడంచి
వస్తువుల నెల్లజూపిన వరుసగాను
జ్ఞానమజ్ఞానమును వినాశమొనర్చి
చూపుఁ బరమాత్మతత్త్వము సోమకీర్తి. 194

ఉ॥ జ్ఞానమునాఁగవహ్నికలుషంబులఁ గాల్చినవాఁడు బ్రహ్మమే
తానగుచుండు నవ్వల నతండభవుండగు పార్థ బ్రహ్మమం
దేనియ తాత్మఁడైనఁ సుగతిన్ గనుటబ్బురమా నె కావునన్
జ్ఞానము సన్నిధానము వెసన్ గనుమయ్యది నిశ్చలంబుగన్. 195

సీ॥ వినుమయ్య విద్యయుఁ దనరుబ్రాహ్మణునిఁ
జండాలుని గరిని శ్వానమును గోవు
జ్ఞానులౌవారలు సమముగా దిలకింతు
రట్టివారికి మోక్షమబ్బగలదు
తలపోయ నట్టివారలకు పుట్టువునందె
పాపంబుదొడరదో పార్థ కాన
పాపవర్జితమైన బ్రహ్మంబునందలి

వారైక్యమగునట్టివారెసుమ్ము
గీ॥ బ్రహ్మమున్ దెలియువాఁడు ధృవంబుగాను
ద్వంద్వములనెల్ల సమబుద్ధిదలచుచుండు
దేవదత్తహిరణ్మయ దివ్యమకుట
చకితరత్నప్రభాక్త మస్తకకిరీటి. 196
గీ॥ బాహ్యవిషయసుఖంబులఁ బడయువాంఛ
లొల్లకున్నట్టి పూరుషుడుత్తముండు
శాశ్వతబ్రహ్మమయమైన సౌఖ్యమందు
నిర్జితామిత్రరాజకుంతీతనూజ. 197
గీ॥ విషయములయందుఁ గలిగిన వివిధసౌఖ్య
ములకు నాద్యంతములుగల వెలమిఁగాన
నట్టి సౌఖ్యావళికి కోవిదాళి యాసఁ
జెందదో పార్థ నిర్జితాశేషవైరి. 198
గీ॥ వినుము యోగాత్రమోక్షణమునకు మున్నె
కామమున్ గ్రోధమునువీఁడు ఘనుఁడె యోగి
వాఁడె సౌఖ్యమ్ముగలిగిన వాఁడు తలప
భరతకులముఖ్య సన్మిత్ర పాండుపుత్ర. 199
గీ॥ అరయ నాత్మప్రకాశము నాత్మసుఖము
గలిగి తానంతరాత్ముఁడై వెలయుయోగి
పుట్టువుననె పరబ్రహ్మభూతుఁడగుచు
జెందు నానందమోవి నిర్జితవిపక్ష. 200
సీ॥ సంశయమ్మును కల్మషమ్ములు నిర్జించి
యింద్రియమ్ములను జయించి సర్వ
భూతమ్ములను సమమ్ముగజూచువారు బ్ర
హ్మానందమునుగాంతు రయ్యవినుము
కామమ్ము గ్రోధమ్ముఁ గడదోర్చి నిశ్చల
మానసులగుచు సుజ్ఞానమెఱుఁగు
నట్టియోగీశ్వరు లంతరించినను జీ
వించిన నానంద మంచితముగ
గీ॥ గాంచుచుందురు కౌన్తేయ ఖచరగేయ

రాజనుతిపాత్ర యో పాండురాజపుత్ర
కాలకేయాది ఘోరరాక్షస మహోగ్ర
దుర్మదాంభోదపవన విధూతకలుష. 201

సీ॥ నెవ్వఁడివిషయ సౌఖ్యమ్ములం ద్యజియించి
భ్రూమధ్యమున దృష్టి నేమముగను
జేర్చి చలింపని చిత్తమ్ముతోడ బ్రా
ణాపానములు నాసికాంతరమున
జరియించునట్టుల సమముగా నొనరించి
యింద్రియాదులను జయించి శాంత
మునుబూని నిత్యము మోక్షాభిలాషియై
భయము వాంఛయును కోపంబువిడిచి

గీ॥ యుండువాఁడనవరతము ముక్తుఁడుసుమ్మ
సర్వభూతాధిపుని తపస్సవనయోగ్యు
నన్నతఁడు గాంచుదాన శాంతంబునొందు
రమ్యగుణధామ సంగరరంగభీమ. 202

---

## షష్ఠమోఽధ్యాయము.

### — ( ఆత్మసంయమ యోగము ) —

సీ॥ పాయకవినుమయ్య చేయఁగాదగినట్టి
కర్మములఁ ఫలకాంక్షవదలి
సలిపిన నాతని సన్యాసియనియోగి
యని పండితోత్తము లాడుచుంద్రు
తలపగా నగ్నిహోత్రమ్ములు వీడిన
నాతడుకాడు సన్యాసియోగి
గాడు పాండుతనూజ ఘనులు సన్యాసము
గా జెప్పునదియె యోగమ్ముసుమ్ము

గీ॥ కాంక్షవీడనివాడెన్నఁగాడు జ్ఞాని
జ్ఞానమున్గాంచనెంచిన మానవునకు
కర్మమే సాధనమ్ము ముఖ్యమ్ముగాను
దళితశాత్రవనిచయ శాంతగుణహృదయ. 203

గీ॥ నెమ్మితో నిత్యనైమిత్తికమ్ములందు
విషయసౌఖ్యమ్ములందును వేడ్కవదలి
యున్నవాఁడెవ్వఁడో వానికన్న జ్ఞాని
కలుగడని కోవిదోత్తముల్బలుకుచుందురు. 204

గీ॥ తనను తనచేత పోషించుకొనవలయును
తనను నాశనముఁ జేసికొనగరాదు
తనకు దాబంధువనియును తనకుదానె
వైరియని గుర్తెఱింగిన వాఁడు ఘనుఁడు. 205

గీ॥ ఎలమి దేహేంద్రియములఁ జయించు చిత్త
మాత్మకును చుట్టమా యింద్రియముల గముల
నిగ్రహింపని చిత్తమే నిశ్చయముగ
నాత్మకెన్నగఁ బరిపంధియందురు బుధులు. 206

గీ॥ ఇంద్రియమ్ములనెల్ల జయింప శాంతి
దనరు పరమాత్మ నిశ్చలత్వమ్ముఁ గాంచుఁ
దాన సుఖదుఃఖములను సీతలము వేడి
మానమవమానమెన్న సమానముగను
గాంచు పురుషుఁడు ఘోరసంగ్రామభీమ. 207

గీ॥ జ్ఞానవిజ్ఞానసంతృప్తుఁడైన నిర్జి
తేంద్రియుండెన్నఁగూటస్థుఁ డింద్రపుత్ర
వాఁడుసమలోష్టహేముఁడౌ వాఁడువాని
యోగియని పల్కుచుందురా యోగవిదులు. 208

గీ॥ మానసంబున నపకారులైనవారి
హితులనహితులబాంధవవితతి దురిత
చిత్తులను సాధువులను దాసీనులను స
మానముగఁ గాంచువాఁడు సుజ్ఞాని పార్థ. 209

సీ॥ నిర్మలజ్ఞానియై నెగడు యోగీంద్రుండు
నెమ్మిరహస్యస్థలమునందు
ఆ నొంటినుండి గాత్రమ్మును నెమ్మది
న్నియమించుకొని మహాసియుడగుచు
చేరాసఁవదలి సంసారబంధమ్ములు

మాని యాత్మను సత్సమాధియందు
నునిచినవాని సజ్జనులెల్ల యోగిశుఁ
డనివచియింపుదు రయ్య పార్థ
గీ॥ సఖుఁడ వినుమీపవిత్ర దేశమ్మునందు
కడఁగి యెక్కువ తక్కువ గాని యట్టి
ధరణి ధర్భాసనమ్మును దానిపై మృ
గాజినము దానిపైన జితాసనమ్ము
పొంకెయాసనములుగూర్చుకొంట దగవు. 210
సీ॥ అర్జునావినుము తదాసనమ్మునను ని
శ్చలతగాంచిన బుద్ధిగలిగి నియమి
తేంద్రియుండై యోగమెలమిఁ బ్రారంభింప
వలె నాత్మశుద్ధికై చెలిమికాడ
తనువును తలయుగంధరము గదల్పక
దిక్కులుగనకసుస్థిరముగాను
నాసికాగ్రమున నెన్నఁగ దృష్టియున్నిల్పి
యుండగావలె కోవిదోత్తమదిమె
గీ॥ ఆత్మశాంతిగలుగు నవ్యాలభయమును
వదలి బ్రహ్మచర్యవ్రతముచేత
గీ॥ నన్నుదలచుకొనుచు నాయందు చిత్తము
నిలిపి కూరుచుండవలయుసుమ్ము. 211
ఇంద్రియమ్ములనెల్లఁ జయించుయోగి
వరుడు నాయందు జిత్తము బదిలపరుప
వానికబ్బును మదధీనమైనదగుచు
వెలయు శాంతి వినిర్జితవిమతనిచయ. 212
గీ॥ పరిమితాహారియై యల్లె పరిమితముగ
నిసురజెందెడివానికి నిశ్చయముగ
కవ్వడీయబ్బు నిట్టియోగమ్ము దీని
దెలిసివర్తింపుచుంద్రు యోగులుసతమ్ము. 213
గీ॥ కానఁయుక్తాశనమ్మును గలిగియుక్త
కర్మముఁగల్గి నిదురయుక్తముగఁ గలిగి

యుక్తచేష్టలచే నొప్పియుండి యుక్త
మైనజాగరముననుండు నతఁడుగాంచు
నిట్టియోగమ్ము సుమ్ము దేవేంద్రపుత్ర. 214

గీ॥ అరయ నేకాగ్రతనొప్పిందినట్టి చిత్త
మాత్మయందుండి కోరికలన్ని యెపుడు
పోవునో యప్పుడే యుక్తపురుషుఁడగును
వాడు బేర్కొనఁబడు బుధవరులచేత. 215

గీ॥ వినుమునిశ్చల చిత్తుఁడై వెలసియున్న
యోగియాత్మ నుసంధాన భోగమహిమ
దెలియగాఁగోరిగాడు పుమెలగనట్టి
కడలనుండినదీపము కరణినుండు. 216

సీ॥ వినుము యోగాభ్యాసము నఁగట్టబడినట్టి
డెందమెప్పూరటఁ జెందగలదో
శుద్ధమైనసమాధిఁ జోతిస్వరూపాత్మఁ
గాంచితానపుడు మోదించగలఁడో
యింద్రియసముద యంబెఱుగని వస్తువు
లలిబుద్ధిచేనెప్పు దెలిసికొనునో
యనవరతంబు బ్రహ్మానందముననుండి
చలియింపకెప్పుడు మెలగగలడో

గీ॥ యెట్టిపరమాత్మ తత్వము నెఱిగికడువి
చారమబ్బిన జనుఁడునిశ్చలత గాంచు
నెట్టిలాభంబుబొంది లేదింతకన్న
లాభమని యోగి తానైతలంప గలడో
పురుషుఁడప్పుడు దుఃఖము లొబ్బనడంచు. 217

సీ॥ పార్థసంకల్ప సంభవములౌ వాంఛలఁ
వదలివివేక భావంబుతోడఁ
నారసినిఖిలేంద్రియముల గట్టడఁజేసి
చిత్తమ్ము పరమాత్మ జేర్చిచింత
దక్కనెమ్మదిలోన ధైర్యంబు గనియోగ
మభ్యసింపగ వలెనయ్య సఖుడ

చంచలంబలవడి ధైర్యమ్ముగానని
చిత్తమ్ము విషయాళి జెందనీక
గీ॥ నాత్మకు న్వశముగా జేయు మయ్యనీవు
శాంతబుద్ధి రజోగుణ సంగతుండు
గాని వాఁడెన్న జీవముల్లలిగి ముక్తి
గాంచునాతండు సౌఖ్యము గాంచుమిత్ర. 218
గీ॥ ఇంతకుఁ మున్ను జెప్పినట్లెపుడు యోగి
తామనోవృత్తి మరలుపు తథ్యముగను
పాపముల్వీడి బ్రహ్మసంస్పర్శసుఖము
బొందఁ [illegible]లలేని యానందమందు సఖుడ. 219
గీ॥ సఖుఁడ సర్వభూతసముడైన యోగి తా
నఖిలభూతనిచయ మాత్మయందు
దనరునని తలంచు తనయాత్మ సర్వభూ
తముల నున్నదనుచు దలఁచుచుండు. 220
గీ॥ ఎల్లమతములుఁగలిగి నేనెల్ల భూత
జాలములనుండువాఁడ నాఁజాడ దెలియు
వానికే వేరుగానుండఁ వాడునాకు
వేరుగానుండడో రణవీరమాళి. 221
గీ॥ ఎవడు నిశ్చలబుద్ధి నన్నెల్లభూత
ములవసించిన వానిఁగా దెలిసికొనునో
వాఁడు నా తేజమున్బొందు వాఁడు ధృవము
ఖండితారాతిసముదాయ పాండవేయ. 222
గీ॥ పరుల సుఖదుఃఖములఁ దనభావమునను
తనవిగా నెంచునట్టి యుత్తముఁడు సకల
భూతములకన్న నెక్కుడై బొల్చునాకు
దివ్యసుగుణసమాజ కుంతీతనూజ. 223
గీ॥ నావుడుఁ బార్థుఁడా పద్మనాభుఁగాంచి
పలికెఁ మధుసూదనా నీవు పల్కినట్టి
యోగమెన్నఁగ స్థిరముగా నుండదనుచు
నమ్మఁగాఁజాల నెమ్మది నందపుత్ర. 224

సీ॥ కారణమేమనంగా విను దెలిపెద
నానుడు విపుడవధానముగను
తామరసాక్షచిత్తము చంచలమ్మైన
దే కాక తనువు నింద్రియచయంబు
క్షోభమందగఁ జేయుచును పరాధీనము
గానొనర్చెడియదిగాదె మిగుల
బలమైనయది దృఢకలితమైనదిగదా
కావునపద్మాక్షగాలినడ్డు
గీ॥ యెంతకష్టమ్మొ పురుషున కంతకష్ట
తరముగానెంతు చిత్తరోధమ్మనంగ
నంబుజాక్షుఁడు పార్థున కనియెమృదుల
వాక్యముల తేనెసోనలు వరదబార. 225
గీ॥ వినుము కౌన్తేయనీవిప్పుడనినయట్లు
చిత్తమడ్డుట కేరికి జేతఁగాదు
గానియభ్యాసమూ విరాగమ్ము వలనఁ
నడ్డుపెట్టంగవచ్చు సత్యంబుగాను. 226
గీ॥ పరగఁ నాత్మనుస్వాధీనపఱచుకొనని
వానికీయోగమెట్లలవడును పార్థ
కడఁగి యియ్యాత్మ స్వాధీనపడకయున్న
యోగమలవడదో పార్థ శ్రీగరిష్ఠ. 227
చ॥ అనవుఁడు యోగసిద్ధికి ప్రయత్నము సేయక యోగమార్గముఁ
గనఁ మది శ్రద్ధగల్గి యదునాయక యోగముఁ జలించు న
మ్మనుజుఁడు గాత్రమున్విడిచి మాధవయేగతిఁబొందు దెల్పి నా
మనమున నున్నయట్టి యనుమానము మానుపవే ధ్రువంబుగాఁ
గీ॥ బ్రహ్మమార్గమ్ము తనకు లభ్యమ్ము గాక
నాశ్రయములేక గర్మచయంబునుండి
భ్రష్టుడగునట్టి మనుజుఁడు పవనధూత
జలదమాలికవలె జెడఁగలఁడటంచు
చిత్తముననెంచువాఁడ రాజీవనేత్ర. 229
గీ॥ ఇట్టి సందియముఁ బాపవే ముకుంద

తామరసనేత్ర యికనీవుదక్క నాదు
సందియము బాపునట్టి వారెందులేరు
నావుడర్జునకు యదునాధుడనియె. 230
సీ॥ వినుమయ్యతండ్రి యేమనుజుఁడేకాని యో
గభ్రష్టుఁడైన దుర్గతికి బోఁడు
యోగ్యకార్యమొనర్చు యోగితానిహపరం
బులకును జెడమిఁ నిక్కమెసుమ్ము
పుణ్యాత్ములెల్లరు బోవు లోకములకు
జనియందు పెక్కువత్సరములుండి
యాచారవంతులైనట్టి వారలయిండ్ల
భాగ్యమ్ము గలవారి భవనములను.
గీ॥ కడఁగి ధీమంతులౌ యోగి గణములకును
పుట్టుచుందురు ధనముగలట్టివారి
యిండ్లబుట్టక పేదవారేని యోగు
లకుజనించుటమిగుల గౌతుకముగాదె 231
వ॥ దానికిఁ గారణంబేమంటేని
గీ॥ పుణ్యులౌ యోగివరులకు బుట్టెనేని
పూర్వజన్మమునఁ జేయుపుణ్య మహిమ
జేసిపూర్వాభి యోగ సంసిద్ధిగలుగు
తత్ప్రయత్నంబునఁ దగుల్ప డుమనంబు 232
గీ॥ కడుప్రమాదమ్ముచేతఁ యోగంబుఁజెడిన
కుంతిపుత్రక కడుబలవంతమైన
పూర్వభవమునఁ జేసిన పుణ్యమహిమ
లాగునద్దాన యోగఫలంబు గనును. 233
గీ॥ యోగమతిశయముగ జేయుయోగి సకల
పాపములబాసియుత్తమపదము గాంచు
పెక్కుజన్మమ్ములఁ జేసిదక్కగొన్న
యట్టిసంస్కారముల జేసి యాప్తమిత్ర. 234
సీ॥ వనిపత్రములు ఫలవ్రజముల మెక్కిత
పంబొనరించు తపస్వికన్న

శబ్దార్థములయందు చతురత్వమున్గల్గి
వెలసినషట్ఛాస్త్ర విదులకన్న
వేదోదితమ్ములై వెలసిన సవనమ్ము
లాచరించినసోమ యాజికన్న
నిశ్చలచిత్తుఁడై నిష్కల్మషాత్ముఁడై
రాగమ్ము విడినట్టి యోగిఘనుడు.
గీ॥ కాననీబుద్ధినిలుపు యోగమ్ముపైన
నన్ను చిత్తమ్మునన్నిల్పి సన్నుతించి
యోగమొనరింపు చున్నట్టి యోగినాకు
సమ్మతంబైన వాఁడయో సవ్యసాచి. 235
వ॥ అని నిఖిలభూతాంతర్యామియగు హరిపౌరందరి కెఱింగించె ననుట
యు సంజయునిగాంచి యాంబికేయుం డవ్వలి వృత్తాంతబడుగుటయు 236
శా॥ వాగీశాన్వయవర్ధనావిజితదుర్వ్యామోహసద్భాషణా
రాగద్వేషవిదూరహృత్కమల శ్రీరామాభిధా బ్రహ్మవి
ద్యాగీర్వాణగురూత్తమాగతమనస్తాపదయాసాంద్రహే
మాగశ్రేష్ఠ సమానధైర్య బుధవర్యానందితార్యవ్రజా 237
క॥ విమలగుణనిచయవిజ్ఞా
నమయా వేదాంతతత్వ నందితసుజనా
సమలోష్ట హేమవిద్యా
కమలోద్భవసాత్వికప్రకాశితబుద్ధీ. 238
మ॥ విదళితాఖిలపాపజాల పవిత్రనందిత కోవిదా
విదితకీర్తి విశాలసజ్జన విసరగేయదయామయా
సదమలాత్మక యోగతత్వ విచారపోషితయాచకా
మదనమోహన రూపసుగుణ సమాజసద్ద్విజపుంగవా. 239

గద్య॥ ఇది శ్రీమదుప్పల వెంకటేశ్వర
ప్రణీతంబైన కృష్ణగీతయందు
ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీకృష్ణాయనమః

# శ్రీకృష్ణగీత

## ద్వితీయాశ్వాసము.

## సప్తమోఽధ్యాయము.

### —॥ విజ్ఞానయోగము ॥—

క॥ శ్రీమత్సుగుణ ప్రచయా
కామాద్యరివర్గదూర ఖండిత కలుష
స్తోమా సంతతయోగ
క్షేమా శ్రీ పాలపత్త్రి శ్రీరామాఖ్యా. 1

వ॥ అవధరింపుమని సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె నట్లు పార్థు
నకు హరివచించి మఱియునిట్లనియె. 2

ఉ॥ నాయడ నిచ్చఁగల్గియు మనంబునఁ నన్నెపుడాశ్రయించి కొం
తేయుడ యోగముల్ స్థిరమతిన్గల పూనికనభ్యసింపుచున్
బాయకఁ నన్ను బూర్ణుని ధృవంబుగ సందియమెల్లఁ బాసిని
వేయనవొప్పఁగాంచి తరియింతువో తద్విధమాలకింపుమా. 3

గీ॥ దేని దెలిసినమీద క్షితిన్గరొకడు
దెలిసికొను నదిలేదొ తద్విధమునీకు
దెలియఁజేసెద వినుమయ్య తెల్లముగను
పాండురాజ తనూజ వైభవబిడౌజ. 4

గీ॥ వేలకొలఁదిగ గల మానవాళి నొక్క
రుండె మోక్షముఁగోరుచునుండు నటుల
నుండుపుణ్యులలో నొక్కరుండె నన్ను
కనుగొ నజ్జాలువాడు నిక్కమ్ముగాను. 5

గీ॥ ధరణిజలమగ్నివాయు వంబరము చిత్త
మా యహంకారమును బుద్ధియనఁగ విధము
లెనిమిదిగఁ మూరె నామాయ యిదియె ప్రకృతి
దానిఁ వివరింతుఁ విను పురందరకుమార. 6

గీ॥ పార్థ నేనిప్డు నుడివిన ప్రకృతిశుద్ధ
మైన దనఁగాదు శుద్ధమైనట్టి ప్రకృతి
దనదుఁ వేరుగఁ నిఖిలభూతములఁ జేఁ

నిండిన ప్రపంచమున్ దాల్చుచుండు సతము. 7

వ॥ భూతోత్పత్తి స్థితిలయంబులకు హేతువైనది శుద్ధప్రకృతి యనం
బడు నట్టి శుద్ధప్రకృతియే బ్రహ్మంబట్టి బ్రహ్మంబనఁ నేనుగాన
నెల్లలోకంబులఁ బుట్టించుచుండును పోషింపుచుండును గిట్టింపు
చుండునని మఱియు వినుమని యిట్లనియె. 8

క॥ విమలమణిజాలములు సూ
త్రమునన్ గూర్పంగఁబడు విధమ్మనను ప్రపం
చము నాయెడఁగలదు కురూ
త్తమ నాకితరమ్మలేదు తథ్యమొప్పన్. 9

చ॥ జలములలోఁ రసంబుఁ రవిచంద్రులఁ దేజము పూరుషాళికిన్
గలిగిన పౌరుషంబుఁ గగనంబునఁ శబ్దము వేదజాలమం
దలి ప్రణవంబు నీహృదయతామరసంబునఁ నేనటంచు ని
శ్చలతఁ దలంపుమయ్య దివిజప్రభునందన పాండవోత్తమా. 10

గీ॥ పుడమిఁగల్గిన గంధముభూతములకు
గలుగు జీవనమావహ్నిఁ గలుగు తేజ
మలఘుమహిమాభిరాములై వెలయు తాప
సుల తపస్సన నన్నుగాఁ దలఁచికొనుము. 11

గీ॥ సకలభూతంబులన్ సృష్టిసల్పుటకును
మూలమే నింకఁ సత్కీర్తి శాలికీర్తి
బుద్ధిమంతులకు నగ్గు బుద్ధిఁ నేను
పార్థ నమ్మమ్ము నీదు భావంబునందు. 12

గీ॥ నెమ్మినాలింపుమా బలీయమ్ములైన
కామరాగమ్ము లడఁపగాఁ గల బలమును
నేనె భూతవిరుద్ధమ్ముఁగాని యట్టి
కామరాగమ్ములనగఁ నిక్కముగఁ నేనె. 13

సీ॥ పాండవమధ్యమా పల్కులు వేల్కో
లందిగా నేలబల్కంగ నింక
తతసత్వగుణమే ప్రధానంబుగాఁ గల
భావముల్గల భూతపటలమేను
తగఁ రజోగుణమే ప్రధానమ్ముగాఁగల

భావముల్గల భూతపటలమేను
తామసగుణమే ప్రధానముగాఁ గల
భావముల్గల భూతపటలమేను

గీ॥ వెలయఁ గుణములు మూఁడు నావలనఁ గలుగు
చున్నవని నీవెఱుంగుమో యన్న పార్థ
వాని కేలొంగనవి మదధీనములుగ
దయ్యెనయీరీతిఁ దెలియగదయ్య నీవు. 14

గీ॥ ఇట్టిగుణములచేఁ జగంబెల్ల మోహ
కలితమ్మైయుండెఁ ద్రిగుణకాండమునకు
పరుఁడనైయుండి నాశనంబెఱుఁగ నట్టి
నన్ను మూఢాత్ములెల్లఁ గానంగలేరు. 15

వ॥ త్రిగుణాత్మికయు దేవసంబంధినియు నగు నామాయను నాభక్తులుఁ
దక్క నన్యులగువారు దెలియఁజాలరు కాన మన్మాయాపహృతజ్ఞాను
లగు నరాధములు రాక్షసభావులగుటఁ జేసి నన్నాశ్రయింపనేరరని
హరి మఱియు నిట్లనియె. 16

గీ॥ విజయ వినుమయ్య నను నాల్గువిధములైన
వారు భజియింపుచుందురవ్వారిఁ వినుము
తస్కరవ్యాఘ్ర రోగబాధలఁ దపించు
వారలర్థార్థులైనట్టివారు జ్ఞాను
లారయ జయేచ్ఛఁగల్గినవారు సుమ్ము. 17

గీ॥ శాశ్వతానూనభక్తిఁ బ్రశస్తుఁడగుటఁ
జ్ఞానిశ్రేష్ఠుండు వారిలోఁ సంతతమ్ము
ప్రియముఁగూర్చుచుఁ వానిహృదయములోనఁ
బాయకుండెద నెప్పుడుఁ బాండుపుత్ర. 18

గీ॥ తక్కుమువ్వురు భక్తులుత్తములెకాని
వారికన్నఁ సమాహితభావుఁడైన
యాతఁడెన్నఁగఁ జ్ఞానియైయలరునతఁడు
దలఁచు నేనను సద్గతి నెలమిఁజెంద. 19

గీ॥ పెక్కుజన్మములెత్తిన పిదప నట్టి
జ్ఞాని భగవంతుఁడేకదా సర్వమనుచు

ప్రత్యగాత్మ స్వరూపునిఁ బరుని నన్నుఁ
జెందునో మిత్ర కౌన్తేయ సిద్ధగేయ. 20

సీ॥ వాంఛల నజ్ఞానవంతులై దమతమ
ప్రకృతులఁ నియమింపఁబడుచు నన్య
దేవతాప్రతతి నర్థిఁగొల్చుచుందురా
కొలుచు భక్తికిఁ మూలమెలమిఁ నేను
వెలయ నెవ్వండెట్టివేల్పునుఁ శ్రద్ధతో
గొలుచునో యాశ్రద్ధఁ గూర్చుచుందు
నాశ్రద్ధచేఁ నరుండాదైవమునుఁ గొల్చి
వాంఛాఫలంబులఁ వడయుచుండు

గీ॥ చెలఁగి యావాంఛ లేర్పాటుచేయునట్టి
వాఁడ నేనౌదుఁ గోర్కులవలనఁ ఫలము
లల్పమతులకు సాంతములగునుఁ నరుఁడు
వేల్పులన్గూర్చి భజియింపఁ వేల్పుఁజెందు
నన్మదిన్గూర్చి భజియింపఁ నన్నెజెందు. 21

గీ॥ నరుడఁ సర్వోత్తముండగు నాదురూప
మెఱుఁగఁజాలకఁ బుద్ధివిహీనులెల్లఁ
ననుమనుష్యాదిరూపముల్గనిన వాని
గాఁ గణింతురు జ్ఞానసాంకర్యమునను. 22

గీ॥ యోగమాయాలతాంగి సంయుతుఁడఁ గాన
నేను సామాన్యులకుఁ గానరాను మిత్ర
యజ్ఞులెల్లరు నేరరేన భవుఁడగుటఁ
భంజితామిత్రసముదాయ పాండవేయ. 23

వ. అర్జునా నేను భూతభవిష్యద్వర్తమాన భూతకోటి నెఱుంగుదు నన్నెవ్వఁడేని యెఱుఁగజాలఁ డందులకుఁ గారణం బాకర్ణింపుము.

గీ॥ స్థూలగాత్రము పుట్టినతోడఁ గోర్కి
వలనఁ ద్వేషంబువలన నేర్పడినయట్టి
నిందితాజ్ఞానమునఁ భూతనిచయమెల్లఁ
నిబిడమోహమ్ముఁ బొందు వినిర్జితారి. 25

ఉ. తలఁపగ మానవుండు సుకృతమ్మునఁ బాపములెల్లఁబోయిని

మ్కలుషుఁ డతండె సువ్రతవిచారుఁడు మోహవిదూరుఁడస్మదీ
యలలితరూపమున్నను మహాత్ముఁడు నన్నుఁడుగాంచ నేరఁడు
జ్వాలమగు నాదురూపముఁ బ్రశాంతమతీ హిమశైలరాడ్ధ్రితీ. 26

క॥ ననుఁ గొల్చి జరామరణము
లనువీడఁ మనంబునన్దలంచిన నరుఁడే
కనుగొను బ్రహ్మంబతనికిఁ
దనరును సుజ్ఞానమనెడి ధనము కిరీటీ. 27

గీ॥ సాధిదైవంబితండని సాధియజ్ఞు
డితఁడని సాధిభూతుండు నీతఁడనుచు
నన్నెవాఁడెంచునో వాఁడు నన్నుమఱువఁ
డంతమునఁ బాండుపుత్రప్రశాంతచిత్త. 28

---

## అష్టమోఽధ్యాయము.

### — అక్షరపరబ్రహ్మయోగము. —

వ॥ అనినఁ గుడాకేశుఁడు గోవిందునిఁగాంచి యిట్లనియె. 29

సీ॥ అంబుజనాభ బ్రహ్మంబననేమియూ
నధ్యాత్మమననేమి యగునుకర్మ
మననేమియధిభూతమననేమి యధిదైవ
మననేమి గాత్రమునందుగలుగు
యజ్ఞమ్ములందధి యజ్ఞమ్మనగనేమి
యగుఁ గాత్రమున నధియజ్ఞముండు
టెట్లులనియత బద్ధేంద్రియుండై యున్నఁ
మరణకాలమున నిన్నెఱుఁగుచుండు

గీ॥ టెట్లొ వచియింపుమయ్య నాకిందిరేశ
శ్రీకరాకార గోపికాచిత్తచోర
సుజనమందార దుర్వారవృజినదూర
నావుఁడుఁ గిరీటికంభోజనాభుఁడనియె. 30

సీ॥ సవ్యసాచీప్రపంచమునకు మూలమై
బరగునక్షర పరబ్రహ్మమనగ
నట్టిబ్రహ్మము ప్రత్యగాత్మ స్వరూపుఁడై

దనరుచే యధ్యాత్మమనఁగ నొప్పు
భూతావళిన్సృష్టి బొందించు దేవతో
ద్దేశమ్మగానతి స్థిరతఁ జేయు
నట్టి ద్రవ్యత్యాగమైనఁ యజ్ఞమ్మగు
నయ్యదియే కర్మమనివచింత్రు
గీ॥ పురుషుఁ డధిదైవతమ్మధిభూత మనఁగ
నరయనాశనయుక్తమైనట్టిదయ్య
వెలయనధియజ్ఞమనఁ గాత్రములఁ జెలంగు
నేనటంచును దలఁచుమా మానసమున. 31
ఉ॥ ప్రాణములన్త్యజించుతఱిఁ బార్థ నరుండెవఁడేని నన్మదీ
ధ్యాన మొనర్చునేనిఁ బ్రముదంబునఁ నన్గను సందియమ్ములే
దే నరుఁడేనిఁ జచ్చునపుడెయ్యదిఁ గోరునొ దాని బొందువా
డో నరపాల మాన్యసుగుణోదధివై వినుమింక దెల్పెదన్. 32
క॥ తలపునఁ నిలుపుము నన్నని
సలుపుము నీచిత్తమెపుడుఁ సఖుఁడా యం
దలినెలకొనఁ జేయుమున
న్గలసెదవో విక్రమప్రకాశిత కీర్తీ. 33
గీ॥ అన్యవిషయానపేక్షచే ననవరతము
చెలఁగి యభ్యాసయోగమువలనశుద్ధ
భావమునఁ దివ్యమూర్తిని బరమపురుషుఁ
జిన్మయున్నన్నుఁ గొల్చినఁ జెందవచ్చు. 34
సీ॥ సుకవిఁ బురాణుసుశ్లోకునిఁ సర్వని
యామకుఁ దాతనవ్యయునిఁ బరునిఁ
భాస్కరతేజునిఁ బరమాత్ము నిశ్చల
భక్తిచేతను యోగబలముచేతఁ
బ్రాణవాయువును భ్రూభాగాంతరమ్మునఁ
జేర్చి నెమ్మదినన్భజించి నట్టి
ఘనుఁడుఁ పరబ్రహ్మమునుఁ జెందగలఁడుఁ ని
శ్చయముగాఁ వినుమయ్య సవ్యసాచి
గీ॥ వేదకర్త నక్షరముగఁ వేదవిదులు దేనిఁ

నుడువుచుందురో రాగమ్మువిడచి యతులు
దేనిఁ బొందుదురో దేనిఁ దెలియఁ బ్రహ్మ
చారులై గురుని సత్పదాంభోరుహములు
గొల్చుచుందురో దానినేఁ దెలుపువాఁడ. 35

సీ॥ ఇంద్రియపాళిఁ జయించియు హృదయప
ద్మమ్మునఁ బుద్ధిరోధమ్ముఁ జేసి
ప్రాణవాయువును భ్రూభాగాంతరమ్మునఁ
నిలిపి నిశ్చలయోగ కలితుఁడగుచు
నక్షరత్రయము నేకాక్షరమ్ముగఁ మారు
ప్రణవమే యాపరబ్రహ్మమనుచుఁ
దనువుఁ ద్యజించెడి తఱిఁ నన్ను ధ్యానించు
పుణ్యుఁ డుత్తమగతిఁ బొందుచుండు

గీ॥ మానసం బన్యవృత్తికి మరలనీక
దినదినము నన్ను మదినిఁ బ్రార్థించునట్టి
వాఁడు సులభమ్ముగాఁ నన్నుఁ జూడఁగలఁడు
దివసనాయక తేజ కుంతీతనూజ. 36

గీ॥ నన్నుఁ జెందిన పుణ్యులెన్నంగఁ మోక్ష
పదముఁ గాంచినవారౌటఁ బహుళదుఃఖ
భాజనమ్మగు పుట్టుకఁ బడయబోరు
ఖండితామిత్ర సుచరిత్ర పాండుపుత్ర. 37

గీ॥ అర్జునా బ్రహ్మలోకపర్యంత మెట్టి
లోకములకేగిన జనానీకమెల్ల
దిరిగి జన్మించుఁ నన్ను జెందిన జనుండు
మరలఁ జన్మింపఁడో నరవరకుమార. 38

గీ॥ యుగసహస్రమ్ముపగలగుఁ యుగసహస్ర
మరయఁ రాతిరియగును బ్రహ్మకుఁ గిరీటి
జ్ఞాన నీకాలనిర్ణయ క్రమమెఱుంగు
వారహము రాత్రి నెఱిఁగినవారు పార్థ. 39

గీ॥ బ్రహ్మదేవునకు న్దోఁచుపగటిపూట
పార్థ యవ్యక్తమైనట్టి ప్రకృతివలన

భూతములు పుట్టునతనికిఁ రాత్రియైన
తత్ప్రకృతి లీనమగును భూతములగములు. 40

గీ॥ మున్ను బుట్టిన భూతసముదయమెల్ల
నడఁగియుండును రాత్రియైనంత బగలు
పుట్టుచుండును పాండురాట్పుత్త్ర నిరత
ధర్మచారిత్ర దురిత లతాలవిత్ర. 41

గీ॥ వివిధభేద చరాచర వితతికెల్ల
హేతువై ప్రకృతికన్నఁ దా నితరమగుచు
స్థిరత నుత్కృష్టతయుఁ గల్గి తెలియఁబడక
నుండు బ్రహ్మంబు నశియింపకుండు పార్థ. 42

గీ॥ దేని నవ్యక్తమనుచును దేని నక్ష
రమ్మని వచింతురో ప్రపంచమ్మునందు
దేనినొంది మనుజుఁడు తిరిగి మరలఁ
జన్మమందఁడో దానినో సవ్యసాచి
రూఢిఁ మదినెంచుమయ్య నాస్వరూపమనుచుఁ. 43

గీ॥ నెవనిచేఁ బూర్ణమై జగంబెల్లనుండు
నెవనిలోఁ భూతసంచయమెల్లనుండు
నట్టిపరుఁడను నేనె సత్యముగఁ సుజన
తతికి నేకాంతభక్తిచేత స్లభింతుఁ. 44

గీ॥ నరుఁడ వినుమెప్డుపాసనాపరులు పోయి
మరలబుట్టరొ కర్మాళిఁబఱఁగువార
లెపుడు మరణించి జన్మములెత్తుచున్న
వారొ తెల్పెదఁ నీకిఁక వీరమౌళి. 45

వ॥ అన లోత్తరాయణసితపక్షదివాభిమానులగు వేల్పులు సంచరిం
చు మార్గంబనుసరించిన బ్రహ్మవేత్తలకు పునరావృత్తిలేదుమఱియు

సీ॥ దక్షిణాయన కృష్ణపక్షధూమతమోభి
మానులౌ వేల్పులేమార్గమునను
వర్తించుచుందురో వాసవీతన్మార్గ
గమనులైపోయెడి కర్మయోగి
కాండముల్ చంద్రలోకమ్మున కేతెంచి

తత్కర్మఫలము లంతంబునొందఁ
మరలఁ నెత్తెదరు జన్మమ్ములు ధ్రువమది
రహినర్చిరాది మార్గమ్మునాగ.

గీ॥ నరయఁ ధూమాదిమార్గమ్మటంచుఁ జ్ఞాను
లెల్లరు న్బేరుకొనియెద రీవిధముగఁ
గడుఁ బురాతనముననుండి క్రాలుచుండు
పాండుభూపాలపుత్ర విఖండితారి. 47

గీ॥ సఖుఁడవహ్న్యాది మార్గానుసారులైన
వారు శాశ్వతపదవినిఁ వదలకుంద్రు
ధూమమార్గానుసారులై దొడరువార
లెల్ల తా నావృత్తిఁ బొందుకటిది నిజమ్ము. 48

వ॥ కావునఁ గ్రమంబుగాఁ మోక్షసంసారములిచ్చుచున్న యర్చిరాది
మార్గధూమాదిమార్గములెఱింగిన యోగి స్వేచ్ఛామరణుఁడై
యుండునట్టి యోగి తపోదానాదులవలనఁ గలుగు ఫలంబులకు.
తుత్కృష్టంబైన మోక్షంబుగాంచునని హరిమఱియునిట్లనియె 49

---

నవమోఽధ్యాయము.

—— రాజవిద్యారాజగుహ్యయోగము. ——

గీ॥ సఖుఁడ దేనినెఱింగి సంసారముక్తుఁ
డగుచుఁ జనుఁ డందునొతద్రహస్యమట్టి
దేవతోపాసనాక్తమై దేఁజరిల్లు
దానిఁ దెల్పెదఁ వినుమవధానముగను. 50

గీ॥ ఎలమిఁ బ్రత్యక్షమగు బోధగలుగునదియు
విద్యలన్నిలు విద్యపవిత్రమైన
దారహస్యమ్ము సౌఖ్యదంబవ్యయంబు
బ్రహ్మమగుఁ బ్రహ్మమనఁ నేను పాండవేయ 51

గీ॥ అట్టి ధర్మస్వరూపుఁనన్నజ్ఞులెల్ల
నమ్మగాఁజాల రందుచేఁ నన్నుచేర
అందుచేఁ మృత్యుసంయుతమగు మహోగ్ర
తీవ్రసంసారమునను వర్తింపుచుంద్రు. 52

గీ॥ ఇంద్రియాగోచరమ్మగానెసఁగు రూప
మునఁ జెలంగిన నాచేతఁ దనరునీప్ర
పంచమంతయు నీభూతపటలమెల్లఁ
నరయఁ నాయందెకలిగినయవిధృవముగ
భూతములనంటనేఁ బురుహూతపుత్ర. 53

సీ॥ నెమ్మితోఁ నిఖిలభూతమ్ములుఁ నాయెడఁ
గలవని పలికితిఁగాని నిక్క-
మరయఁ భూతములు నాయందులేవాభూత
ములఁ మదీయాకృతి కలయదెప్పు
డీవిధమ్మున నుండియెల్లభూతమ్ములఁ
భరియింపుచున్నది పాలనమ్ము
సేయుచున్నది యస్మదీయరూపముఁజూడు
మింకనా సామర్థ్యమెఱుఁగుమయ్య

గీ॥ సతతమంతటనుండు మారుతముగగన
మందుఁజరియించునటులఁ నాయందుసకల
భూతములు నిండియుండెఁ విఖ్యాతకీర్తి
విమతసమవర్తి విక్రమవిజయమూర్తి. 54

గీ॥ అరయఁగల్పావసానమునందు నాదు
మాయచేఁభూతచయమెల్లఁ మాయుచుండు
దిరిగి కల్పాదియందు నేవరుసఁభూత
జాలములనెల్లఁ సృజియింతుఁ సవ్యసాచి. 55

గీ॥ ప్రకృతిచేతఁ స్వతంత్రముఁ బాయునట్టి
భూతములనెల్లఁ నామాయచేతఁ మఱల
మఱల సృజియింపుచున్నాఁడఁ వరుసగాను
సమదశాత్రవదుర్గర్వ జలదపవన. 56

గీ॥ ఏనుదాసీనుడఁ న్వీనుమెల్లసృష్టి
కాదినుండియుఁ గర్మచయంబునందు
సక్తుఁడనుగాను దానఁ నిశ్చయముగాను
కర్మములచేతఁనేనెప్డుఁ గట్టఁబడను 57

గీ॥ సఖుఁడ స్థిరబుద్ధివినుమధిష్ఠాతనగుచు

బఱగు నాయాజ్ఞ బ్రకృతి ప్రపంచమెల్లఁ
సారెకుఁ సృజింపుచున్నది సవ్యసాచి
కానఁ మాటికిఁబుట్టుఁ జగమ్ముసుమ్ము. 58

క॥ పందలునాతత్త్వము నృప
నందన తాఱెఱుఁగలేక నన్మనుజునిగాఁ
డెందములఁ దలఁచియూరకఁ
నిందింతురు దానఁనాకు నీచతగలదే. 59

సీ॥ నన్ను నిందించుమానవులెవ్వఱన్నచోఁ
విను మయ్య చెల్పెదఁ విజయనీకు
తలపోయఁవ్యర్థకర్ములుఁ వ్యర్థకాంక్షుల
జ్ఞానపూరితచిత్తులైనవారు
సంతతము రాజసంబునఁదామస
మ్మునఁ సంచరించెడి మూఢమతులు
దూరుచుందురు వారుదూరినఁనాకేమి
తక్కువయగుఁసుభద్రాకళత్ర

గీ॥ ప్రకృతిననుసరించి భావమన్ప్యలయెడ
నుంచబోకఁ నీప్రపంచమందు
నన్నెకారణునిగఁనన్నె సుస్థిరునిగాఁ
దెలియుచుందురు జ్ఞానకలితులెల్ల. 60

సీ॥ అనయంబున స్మదీయావతారంబులఁ
గొనియాడుచుందురు కొంతమంది
సిద్ధులై నిత్యసంసిద్ధులై నిత్యముఁ
గొనియాడుచుందురు కొంతమంది
తలఁపనింద్రియ జయార్థమ్ముగాఁ వ్రతములఁ
గొనియాడుచుందురు కొంతమంది
కడుభక్తితోఁ నమస్కారముల్గావించి
కొనియాడుచుందురు కొంతమంది

గీ॥ సఖుఁడ కొందఱు జ్ఞానయజ్ఞమునఁగొంద
ఱితరభావమ్మునఁ గొందఱేకభావ
మునను కొందఱు సర్వాత్మునిగఁ నన్ను

వేడ్కతోడుతఁ సతము సేవింపుచుంద్రు. 61

వ॥ అదియునుగాక.

సీ॥ వెలయ నగ్నిష్టోమములు మున్నుగాఁగల
యజ్ఞముల్ శ్రాద్ధములన్న నేను
కనఁ నోషధులయందు కలుగుచున్నట్టియ
న్నంబనఁ నేనుమంత్రములు నేను
తలపోయఁ నగ్నిఘృతంబు హోమము నేను
జగములకెల్లఁ నిశ్చయముగాను
తల్లినై తండ్రినై తగుకర్మఫలములొ
సంగువాఁడను నేను సవ్యసాచి.

గీ॥ ప్రణవము న్వేదమును కర్మఫలములను భ
రించు దేవుఁడనవి నియమించువాఁడ
మంచిచెడ్డలు నేనె వీక్షించువాఁడ
నిజము కుంతీతనూజ నిర్నిద్రతేజ. 62

గీ॥ ఏనొడఁగూర్చువాఁడ నభీష్టములను
భోగపదపాలకుఁడ నేను త్యాగి నేను
చంపఁ సృష్టింపబోషింపఁ జాలువాఁడ
నేను శాశ్వతబీజము నేనుమిత్ర. 63

గీ॥ కవ్వడీ వినఁగదయ్య భాస్కరుఁడఁ నేను
క్షోణివర్షించునట్టి మేఘుండ నేను
వినుము భూతమ్ములకును జీవనముఁ నేను
పలుకులేటికి సర్వప్రపంచమేను. 64

గీ॥ హితుఁడ వినుమయ్య మృత్యుదేవతను నేను
ప్రకృతియన నేను వికృతినై బరగుచుందుఁ
సజ్జనాగ్రణులెల్ల శ్రీచందమెఱిఁగి
నన్నుస్మరియింపుచుంద్రు మానసములందు. 65

సీ॥ ధర్మజావరజ వేదములఁ జెప్పినయట్టి
కర్మములం దిచ్ఛగలిగి యోగ
ములు మదీయధ్యానపూర్వకమ్ముగ నాచ
రించి తచ్ఛేషమభ్యంచితముగఁ

భుజియించి పాపముఁబోదలంచియు స్వర్గ
మును గోరుచున్నట్టి మనుజులెల్ల
యింద్రలోకమ్మున కేతెంచి దేవభో
గమ్ములఁ బడయఁగాఁ గలరుసత్య

గీ॥ మట్టివారికి తమదు పుణ్యంబుక్షీణ
మైనఁ జనలోకమునకు తాఁజిఱుఁదెంతు
యాగమోదిత కర్మములాచరించు
వారు వాంఛలఁ విడిచేయనలయు సఖుఁడ. 66

గీ॥ అన్యులఁ భజింపకుండి నన్నాశ్రయించి
వెలయుచున్నట్టి మద్భక్త వితతికెల్ల
గూర్మియోగమ్ము సేమమ్ముఁ గూర్చుచుంటి
గానఁ ధ్యానింపుచూ నన్ను మానసమున. 67

గీ॥ తతమనశ్శుద్ధిఁ నెవ్వ రేదైవతముల
గొల్చుచుండినఁ వారు నన్గొలుచువారె
కాని విధ్యుక్తమయ్యదిగాదు సుమ్ము
నీకు వివరింతు వినుము పరాకుమాని 68

గీ॥ వెలయఁ నెవరెట్టిపుణ్యముఁ సలుపుచున్న
భోక్తనగుచుండుఁ బాధ తత్పుణ్యులకును
ఫలములిడువాఁడఁ నేనె ధ్రువంబుగాను
మందులోకకొంద తెలియఁగరీ చందమనుచు 69

సీ॥ దేవతాపాళి నర్ధిన్గొల్చువారలు
దేవతాతతినిఁ జెందెదరు భక్తి
బిత్రుదేవతల సమంచితరీతిగా గొల్చు
వారువారిని బొందువారు భూత
ములఁ గొల్చువారు తద్భూతమ్ములన్బొంద
గలరు నన్గొలిచిన ఘనులు నన్నె
చెందగాఁగలరు పౌరందరీయాక్రైన
గాని పుష్పంబైనఁగాని ఫలము

గీ॥ గాని జలమేనిఁ నరుఁడు నిష్కళంకభక్తి
నాకిడఁగ బ్రీతితోడుతఁ స్వీకరింత

నెట్టికృత్యంబులేనియే యీవులేని
యెట్టికర్మములేని నన్నెలమిఁజెందు. 70

గీ॥ కానఁ ఫలకాంక్షలేనట్టి మానసమున
నన్ను సేవింపుమయ్య సన్న్యాసయోగ
మునను తద్విధమాచరించినఁ మదీయ
భావము న్జెందగలవు ధృవంబుగాను. 71

గీ॥ సర్వభూతసమానుండఁ సవ్యసాచి
కానఁ నాకొక్కమిత్రుఁడుగాని వైరి
గాని లేరెవ్వఁడైన నన్మానసమునఁ
గొలుచు మనుజుఁడేనాకు భక్తుండుసఖుఁడఁ 72

ఉ॥ ఆరయ నన్నుమానసమునందు భజించినయట్టియేమరా
చారుఁడుఁగాని శుద్ధుఁడని సాంత్వమునన్దలపోయగాదగుఁ
గారణమేమనన్నుగతి గాంచగనన్భజియించుటేసదా
చారముగాదె వానికి నిజంబుగఁ నోపురుహూతనందనా 73

వ॥ కావున నెట్టి దురాచారుండైనను నన్నుగొల్చు భక్తాగ్రగణ్యుండ
పుణ్యాత్ముఁడు నిత్యమగు శాంతింగాంచు నాశనంబెన్నటి కెఱుంగ
ఁడు సత్యమియ్యదింక రాజర్షులు బ్రహ్మర్షులుత్తమగతిఁ గాంచరని
పల్కనేల పార్థా కాన నస్థిరంబు నాఁబరఁగు శరీరంబుఁదాల్చిన
నీవు నన్నుభజియించి యుత్తమగతిఁ బడయుమని మురదమనుం
డు మఱియు నిట్లనియె. 74

ఉ॥ నాయెడఁ జిత్తమున్నిలిపి నాకతిభక్తుఁడవై మనంబున
న్నాయకఁ నన్నుగొల్చి కురునందన నాకునమస్కరించి పు
ణ్యాయతమూర్తివై నను ఘనంబుగబొందుము నన్ను నమ్మవా
డేయెడ గానిఁ తాను జెడఁ డిందుకులార్ణవరోహిణీధవా. 75

---

## దశమోఽధ్యాయము.

### — విభూతియోగము —

గీ॥ అర్జునా దెందమున ముదమందుచున్న
నీకు మేలొనరింపగా నేను గోరి
తెలుపబోయెడిమాట సుస్థిరతనాల

కింపగదవయ్య మోహము ద్రుంపుమయ్య. 76
గీ॥ దేవతలుగాని మునులేని తెలియఁజాల
తెలమివారలకును హేతువేనెయగుటఁ
నభవుఁడు పురాణ పూరుషుఁడనుచునీప్ర
పంచకారణుఁడనుచు నన్నెంచువాఁడు
పాపములఁ బాసితా బ్రహ్మపదము జెందుఁ 77
సీ॥ బుద్ధి యాత్మజ్ఞానమును మోహరహితమ్ము
నోర్పు సత్యమ్మింద్రియోపమ్మనిగ్ర
హమ్ము హింసాకృత్య మనురాగరహితమ్ము
జన్మమ్ము తపము యశమ్ము సుఖము
దానమ్ము పరితుష్టి తద్వ్యతిరేకము
ల్లలి మానవులకు నావలనఁబుట్టు
శుద్ధులైనట్టి ఋషుల్ వాటికన్న పు
రాతనుల్ సనకాదిపూతచరితు
గీ॥ ల్లమనువులు మద్భావమనుసరించి
నాతలంపున బుట్టిరినరుఁడ వారి
వలనజన్మించి యీమానవులు క్రమముగ
నంచితంబైనయట్టి ప్రపంచముననుఁ 78
గీ॥ ఆపురాతనులైన ఋష్యాదిసకల
రూపములు నావిభూతిగా రూఢిగాను
కవ్వడీ యోగమహిమచే నెవ్వఁడెఱుఁగు
వాఁడొవాఁడెన్నఁ బుణ్యుఁడైవరలుచుండు. 79
గీ॥ సర్వకారణుఁడనుచును సర్వలోకఁ
ములను సృష్టింపగా శక్తిగలమహాత్ముఁ
డనుచు నన్నెంచికొన్న మహాత్ములెల్లఁ
గొలుచుచుందురు నన్భక్తి గలిగిసతము. 80
గీ॥ నాయడఁ బుద్ధిఁదమజీవనమ్ములుంచి
పొగ్ద నాగాథలన్యోన్య భాషులగుచు
నిత్యసంతోషులగుచుఁ జింతింత్రుసతము
వారలీధర జన్మింపబోరు సతము. 81

గీ॥ ఇట్లునన్గొటి నన్భజియించి యెట్టి
నేర్పువారల జనులునన్ను బొందెదరొ దానిఁ
బుద్ధియోగంబు నీకుదెల్పుదునుపార్థ
జ్ఞానివై విను నేడవధానముగను. 82
సీ॥ ఈవిధినను భజియించెడు మానవ
మానసవృత్తియం దేనుసఖుఁడ
జ్ఞానదీపముగాఁ వెసఁ బ్రకాసించిత
దజ్ఞాన తిమిరము నడఁచుచుందు
నావుఁడు నరుఁడబ్జనాభునితోడ ని
ట్లనియెసద్భక్తి మహానుభావ
భృగ్వాది ఋషులు సంభృతయోగతత్వవి
శారదుండైనట్టి నారదుండు
గీ॥ దేవలుఁడు వ్యాసుఁడసితుండు దేవ నిన్నె
బ్రహ్మముగఁ పావనునిగ ప్రపంచకార
ణునిగ నభవునిగాఁ శాశ్వతునిగజెప్పు
చుందురట్టుల నీవు నాయందు కరుణఁ
దెల్పితివి తీరెనాకు సందియముఁ గృష్ణ. 83
గీ॥ ఇపుడు కరుణించిదెల్పిన దెల్లసత్య
మనిదలంచితి ధన్యుఁడనైతిఁ దేవ
దేవునిగ నిన్నునీదువ్యక్తిని గనంగఁ
జాలరా దేవదానవుల్సరిసిజాక్ష. 84
వ॥ అని మఱియు నర్జునుం డిట్లనియె. 85
గీ॥ భూతములనెల్ల సృష్టింపఁ బోషణమ్ము
సేయమాయింపఁ దగినట్టి తోయజాక్ష
నీవె నీరూపమున్గన నేర్తువొరుల
కరయ శక్యమె వికచపద్మాయతాక్ష. 86
గీ॥ ఈప్రపంచమ్మునందలి యేవిభూతి
చేతఁ బరిపూర్ణతఁ గల్గి జెలగుచుంటి
వావిభూతులు దెలుపగదయ్య నాకు
జలదనిభగాత్ర సంఫుల్ల జలజనేత్ర. 87

సీ॥ ధ్యానంబుచేత మహానుభావా యెట్లు
దెలియగాఁ దగునయ్య దెల్పుమిప్పు
డే భావమునఁ జగదీశనాచే నీవు
ధ్యానింపబడుదువో శ్రీనివాస
సర్వజ్ఞతయు సర్వశక్తిత్వమునుగల్గి
పొల్చు నీదివ్యవిభూతినాకు
విశదీకరింపు దర్వీకరాధీశ్వర
శయనదళత్పంకజాతనయన
గీ॥ దేవదేవ జగద్వంద్య తావకీనఁ
మధురవాక్యమ్ములమృతోపమానములువి
నఁ విన దనివిలేదు మనంబునకును
కరుణఁదెల్పంగదయ్య ముఖ్యమ్ముగాను. 88
వ॥ అనినఁ దామోదరుండు పార్థునకిట్లనియె.
గీ॥ సఖుఁడ వినగోరితివి మదైశ్వర్యములను
కానఁ దెలిపెదవిను మవధానముగను
సకలభూతాళి సృష్టింపఁ సంతరింపఁ
నిగ్రహింపఁ సమర్థుండనేను పార్థఁ 89
గీ॥ దివిజుల మరీచిఁద్వాదశాదిత్యులందు
విష్ణునామునిఁరిక్కలఁ వెలయుశశినిఁ
యమల తేజోనిధానుల నంశుమంతు
డైన భాస్కరమూర్తినేనగుదు పార్థ 90
గీ॥ వేదములఁ సామవేదముఁవిబుధవరులఁ
బాక పరిపంథినింద్రియ పటలమందు
బుద్ధినగుచుందు నీభూతముల జెలంగు
సదమలజ్ఞానమన నేను సవ్యసాచి. 91
సీ॥ ఆరయ రుద్రులయందు శంకరడను
యక్షరాక్షసులఁ ధనాధిపతిని
వసువుల నగ్ని పర్వతముల మేరువుఁ
వెలయపురోహితవితతియందు
మతిమంతుండౌ బృహస్పతిని సేనాధీశ్వ

రుల గుమారుని సరస్సులఁబయోధి
ఋషులలో భృగుమహాఋషిని వాక్కులఁబ్రణ
వాక్షరమ్మును సర్వయజ్ఞములను
గీ॥ జపమనఁ దనరునట్టి యజ్ఞమును స్థావ
రములలోనఁ దుషారపర్వతముఁ నేను
వృక్షములలో నశ్వత్థవృక్షమేను
మునులలోపల నారదమునిని నేనుఁ. 92
గీ॥ రహినిఁ గంధర్వులఁ జిత్రరథుఁడ నేను
సిద్ధులఁ గపిలమౌనినై జెలగుచుండు
హారులయందలి యమృతార్థమబ్ధిఁ ద్రచ్చ
పట్లఁబుట్టిన యుచ్చైశ్రవమును నేను
గజములందలి దేవేంద్రగజము నేనుఁ 93
ఉ॥ నరసముదాయమందు నరనాథుఁడ నాయుధపాళియందు భీ
కరపవినాల గౌరవముగాంచిన వేలుపుటావు సృష్టికిఁ
బరగిన కాముఁడఁ ఫణులవాసుకి నాద నరారువాఁడ నే
నరయఁ గురూత్తమా పరభయంకర పాండునృపాలపుత్రకా 94
సీ॥ వార్ధినాయకుఁడైన వరుణదేవుఁడ నేను
వెయితలల్గల ఫణి విభుఁడ నేను
పితృదేవతల కధిపతి నర్యముఁడ నేను
సమవర్తినైనట్టి యముఁడ నేను
దైత్యులఁ సత్కీర్తిధనుఁడ బ్రహ్లాదుఁడ
మెకముల సింగమన్ మెకము నేన
గణియించువానికిఁ గాలమ్మునగ నేను
పక్షులలోఁ ఖగపతిని నేను
గీ॥ జవముగల్గినవారిలోఁ బవనుఁడనుజ
లేచరావళిలో మొసలిన్ సరిచ్చ
యమునఁ మందాకినీనది నగుదుశస్త్ర
ధారులఁ రాఘవుఁడఁ గురువీర నేను 95
సీ॥ అరయఁగాఁ సృష్టికి నాదిమధ్యాంతముల్
విద్యలయం దాత్మవిద్య నేను

వాదించువారల వాదమ్మునే నక్ష
రములలోపల నకారమ్మునేను
సవ్యసాచీ సమాసములఁ ద్వంద్వసమాస
మననేను కాలాక్షయమును నేను
వెలయఁ ధాతలోనవిశ్వతోముఖుఁడను
మిత్తినిఁ జరుగుయుత్పత్తినేను

గీ॥ సతులకీర్తియువాగ్విభాధృతులు స్మృతియు
క్షమయు మేధయునేనౌదు సత్యముగను
సామవేదములఁ బృహత్సామమేను
ఛందములలోనఁగాయిత్రి ఛందమేను
ఋతువుల వసంతమనునట్టి ఋతువునేను. 96

గీ॥ మాసములఁ మార్గశీర్షమన్మాసమేను
గెలుపుగలవారి నెత్తమువెలయనేను
సాత్వికులకైన సత్వమ్ముజయమునేను
తేజమున్గలుగువారలతేజమేను. 97

ఉ॥ యాదవవంశ సంజనితులై వెలుగొందెడివారిలోన దా
మోదరుఁడన్ మునీంద్రుల మహోజ్వలతేజుని వ్యాసమౌని క్ర
వ్యాద గురుండ సత్కవుల నర్జుననాముఁడ పాండవేయులన్
మోదిత వీరపూరుష సమూహవిరోధిచయస్మయాపహా. 98

సీ॥ దండించువారల దండనమ్మేనౌదు
నిగ్రహించెడివారి నీతినేను
గోప్యతలావారల గుహ్యమౌనమ్మేను
జ్ఞానులయడగల జ్ఞానమేను
సఖభూతములకు బీజమ్మేను నాకన్య
మనఁలేదు జగత్ప్రపంచాంతరమున
సంగ్రహమ్మగ నీకు జాటితిగాని మ
దైశ్వర్యమునకు లేదంత మొకట

గీ॥ నెయ్యదైశ్వర్యమతిశయం బెసగునట్టి
సంపదయు గల్గువస్తువో సవ్యసాచి
దాని నాదువిభూతిగా మానసమునఁ

దలఁపగదవయ్య పార్థ విదారితారి. 99
గీ॥ విజయ తెలుపంగ నేటికి వేరువేరు
గా ప్రపంచమ్మునందు నిక్కంబుగాను
వెలసియుంటిని నాకన్యమెలమిఁ లేదు
దివ్యనుతిపాత్ర మిత్రకుంతీ సుపుత్ర. 100
వ॥ అనవుఁడు పార్థుం డిట్లనియె.

## ఏకదశోఽధ్యాయము.

### —( విశ్వరూపసందర్శనయోగము. )—

గీ॥ అంబుజాతాక్ష పరమరహస్యమగుచు
వెలయుచున్నట్టి యధ్యాత్మవిషయమైన
వాక్యములు దెల్ప నాదుభావమునఁ గల్గు
మోహలతఁ ద్రిలుచుండెఁ సమూలముగను 101
వ॥ దేవా నీయనుగ్రహంబునఁ భూతసృష్టిప్రళయంబులు విని సంతసించితిని. నీవు నాకు వచించినదెల్ల సత్యముగా నమ్మితినింకఁ ద్వదీయరూపంబుఁ గాంచుటకు వాంఛించుచుంటిని. కాన భవద్రూపంబుగాంచుటకు దగినవాఁడనేని యనుగ్రహింపు మనవుఁడు దానవాంతకుం డిట్లనియె.
గీ॥ పార్థ చూడుము పెక్కురూపములు పెక్కు
వర్ణములు పెక్కుచిత్రముల్వ్వరలు నన్మ
దీయమగు సద్విభూతి త్వదీయ వాంఛ
దీర ధర్మవిచార కుంతీకుమార. 103
సీ॥ ఆదిత్యరుద్రాశ్వినీ దేవతామరు
ద్వసువులనెవ్వుడు నేత్రములఁగవని
బహుచిత్రములను ప్రపంచమ్మునచరాచ
రమ్ము నాదగు శరీరమ్మునందు
గనుమింక నీమనంబున నెద్దిఁ జూడగా
దలఁచితివో దాని వెలయనేను
జూపెదగాని యీచూడ్కులతోడఁగా
నంగలేవటులఁ గానన్ గిరీటి

గీ॥ నీకొసంగెదఁ దివ్యమౌ నేత్రయుగము
మామకైశ్వర్యముం గాంచుమా ముదమున
ననుచు హరిపల్కి పార్థునకపుడు జూపె
స్వీయమౌ రూపమో యాంబికేయ వేడ్క. 104

వ॥ అట్టి పరమేశ్వరరూపం బెట్టిదనిన.

గీ॥ పెక్కుముఖములు కన్నులు పెక్కుసాధ
నములనద్భుత విధదర్శనములు పెక్కు
తొడవులున్గల్గి వెలసె తద్రూపమఖిల
రాజసన్నుతపాదపయోజరాజ 105

గీ॥ దివ్యమాల్యాంబరములచేఁ దేజరిల్లి
దివ్యగంధావలేపనోదీర్ణమగుచుఁ
నరయ నాశ్చర్యమాదిమధ్యాంతరహిత
మగుచుఁ బ్రహ్మము రాజిల్లె నవనినాథ. 106

గీ॥ ఏమి చెల్పుదు రాజ తదిద్ధతేజ
మాకసమ్మునఁ సూర్యసహస్రమమరి
యున్నరీతిగఁ దోఁచెఁ దగన్నతాంగ
మునఁ జగమ్ముల నన్నిటిఁ గనియె నరుఁడు. 107

చ॥ నరవరపార్థుఁడంబురహనాభునిరూపము విస్మయంబుచే
నరసి ముదంబుచే బులకితాంగమునన్ బరమాత్మఁ గూర్చి తా
గరములు మోడ్చి మ్రొక్కి త్రిజగజ్జనకా పరమేశ శ్రీశ దు
స్తరదురితాపహా సుకృతతత్పర ధన్యుఁడనైతి నిన్గనన్. 108

శా॥ శ్రీనాథా భవదీయదేహమున నా శ్రీకంఠునిన్ దేవతా
హానివారితము దేవతాతతుల నేమంబొప్పబద్మాసనా
సీనుండై యలరారు ధాతనఖిలాశీత్వేళనాధావళిన్
నానాభూతములన్ గనుంగొని జగన్నాథాయఘుంబూడ్చితిన్.

మ॥ వనజాతాక్ష గణింపరాని కనులున్ వక్త్రమ్ములున్ గల్గి పా
వనమై యొప్పు భవచ్ఛరీరమున కెబ్బంగిన్ విచారించియుఁ
గననాద్యంతము లబ్జనాభ సురముఖ్యా విశ్వరూపాత్మకా
వినుతింతున్ జగదీశ్వరా గతభయా విశ్వేశ నారాయణా. 110

సీ॥ పరిశుద్ధరత్నభాస్వరహిరణ్మయ కిరీ

టమ్ము గల్గిన మస్తకమ్ములవాని
దీప్తానలార్కసాదృశ్యదుతిఁ బొల్చు
దుర్నిరీక్ష్యాకృతిఁ దోఁచువాని
తేజస్సమూహమీతీరునఁ దనయందు
బొందించి యిటువెలుఁగొందువాని
జక్రిముఖ్గదను ప్రశస్తమ్ములైన హ
స్తమ్ములఁ దాల్చిన చతురమతిని
గీ॥ పరమపురుషుఁ జగత్పరిపాలు నేఁడు
గంటిఁ జేకొంటి సకలభాగ్యములు పుణ్య
తముఁడ నైతిని నాదు మోహము నశించె
భవ్యదివ్యావలోకన ప్రకటనమున. 111
సీ॥ అక్షరుండవు పరమాత్ముండ వఖిల యో
గీంద్రవంద్యుండ వో కృష్ణనీవె
శాశ్వతుండవు జగచ్చయమున కాధార
భూతుండవీవె కంజాతనయన
ధర్మమూర్తివి కడునిర్మలమతివి పు
రాతనుండవు దేవకీతనూజ
పురుషోత్తముఁడవీవు హరివవ్యయుండవు
వ్యాసాదినుత కరుణాసముద్ర
గీ॥ తరణిచంద్రాంబకాయ నంతప్రభావ
యఖిల లోకేశ యాదిమధ్యాంతరహిత
నిస్తుల సహస్రహస్తమహిమ ప్రశస్త
ముఖభవత్తేజమున జగములు తపించు
చున్నవని తోఁచుచుండె నాకన్నుగవకు. 112
మ॥ అరవిందప్రతిమాననేత్ర భవదీయంబైన రూపంబహో
కరమాశ్చర్యము భూస్థలాంబర దిశాకాండంబులన్ నిండి భీ
కరమయ్యెన్ దరధారి నిన్నుగని లోకమ్ముల్ మహాభీతిచే
బరఁగె న్నిక్కమటంచు దోఁచినది నాభావంబునం దచ్యుతా.
ఉ॥ సరసిజనేత్ర యాదివిజజాలములోపలఁ గొందరార్తి నీ
శరణము జొచ్చుచుండిరి ప్రశస్తగుణా మరికొంద అందులో

గరములు మోడ్చి డగ్గఱి తగఁ జయవాక్యములాడుచుండిరా
పరమమునీంద్రపాళి నిను భక్తినుతింపుచునుండి రొక్కటన్ 114

సీ॥ ఆదిత్యచయము నేకాదశరుద్రులు
వసువులా యశ్వి దేవతలు సకల
పితృదేవతలును విశ్వేదేవతలు సిద్ధ
సాధ్యులు గంధర్వసముదయమ్ము
యక్షులు వసువులురాక్షసులసురసు
ర్గణము విస్మయమునఁ గాంచుచుండి
యచ్యుతా వక్త్రసహస్రమ్ము నేత్రస
హస్రమ్ము బహుపాదహస్తతతులు

గీ॥ పెక్కుతొడలు దరములు గల్గి పెక్కుకోర
లలరు నట్టి కరాళముల్ గలుగునిన్ను
గాంచ లోకమ్ములకు నాకుఁగలిగె భీతి
శ్రీజగన్నాథ వికచరాజీవనేత్ర. 115

మ॥ సకలవ్యాపకమూర్తివై మహితతేజశ్శాలివై యున్ననీ
వికృతాస్యోరువిశాలలోచనములన్ వీక్షింపగా నెన్నఁడేఁ
వికలం బందని నాదుచిత్తమున కోవిశ్వేశ విశ్వాత్మ నం
దకధారీ దనుజారి ధైర్యమును శాంతం బెక్కడో యచ్యుతా 116

గీ॥ ప్రళయకాలాగ్ని నిభములై బరగి పెక్కు
కోరలుగల్గి కడుభీతిగొల్పు నీము
ఖమ్ములన్ జూడ నాకుభయమ్ముదోచె
దొలగె సౌఖ్యము దిక్కులు దెలియకుండె. 117

సీ॥ విశ్వరూపాత్మక విశ్వేశ నీరూప
మారసి ధన్యుడనైతి నిప్పు
డెల్ల భూమీశ్వరులీ ధార్తరాష్ట్రులు
కర్ణుండు గురుఁడు గంగాతనూజుఁ
డల్ల దృష్టద్యుమ్నుఁడాదిగానుభయసై
న్యంబుల గల వీరనాథులెల్ల
భయదంబులౌ భవద్భవ్యాననంబుల
బడి భిన్నమస్తులై బరగుచుండి

గీ॥ రఖిలనదులెల్ల వారాసికభిముఖముగ
జెలగి ప్రవహింపుచును దాన గలసినట్లు
పరిజ్వరిల్లు భవన్ముఖభాగములను
బొందుచుండిరి యీవీరపురుషులెల్ల. 118
గీ॥ మండుచున్నట్టి ఘోరాగ్నిమధ్యమందు
తారసిలి దూకు మిడతల తీరుగాను
తావకాస్యాంతరముల సత్వరతదూరి
సమయుచుండిరి వీరసంచయములెల్ల. 119
గీ॥ వెలయుచున్న భవన్ముఖమ్ముల నశేష
జగములన్మ్రింగుచుంటి వుజ్వల మహోగ్ర
తేజముల లోకములను బయోజనేత్ర
మాడ్చుచుంటివి సత్యభామాకళత్ర. 120
చ॥ నతులొనరింపుచుంటి నళినప్రభవార్చిత యిట్టిభీకరా
కృతివగు నిన్ను నేడు దిలకించితి నెవ్వడవీవు సత్కృపా
మతి ననుజూడు దేవ నినుమామకభావమునం దెఱుంగ గో
రితిని పురాణపూరుష హరీ తెలియన్వచియింపు మిత్త్రరిఁ. 121
వ॥ అట్టివాడవై యీలోకమున నుండుటకు కారణమేమన హరి మ
రియు నిట్లనియె
చ॥ జగములనెల్ల బ్రోవగవెసఁ సఖుడా పరివృద్ధిజెంది యీ
జగములనున్న ప్రాణులను జంపజరించెద గాలరూపినై
తగనటుగాన వీరిని పృథా తనయా యని నీవుజంపకుం
డగఁ బ్రతుకంగబోరు జననంబన జచ్చుటకేగదా సుమా. 123
ఉ॥ కాన రణంబుసేయ సమకట్టుము వైరులద్రుంపుమీ యశ
శ్శ్రీనిధివై ధరాతలము జేకొని రాజ్యసుఖంబు గాంచుమో
యీనరనాయకావళుల నింతకుమున్నె వధించినాడ నీ
చేనగు కార్యమున్నదె వచింపు నిమిత్తుడవీవు ఫల్గునా. 124
మ॥ అల భీష్ముండు గురుండు సైంధవుడు కర్ణాదుల్ సఖా మున్నె నా
వలనఁ గూలిరటంచు నెంచుము భవద్భావంబునఁ యుద్ధ ని
శ్చలతఁ బూనుము శాత్రవప్రతతి వే జక్కాడుమా నీకగుఁ
గెలుపంచు వచియించె కృష్ణుడనిపల్కెఁ సూతుడా రాజుతోఁ. 125

క॥ నరవర హరివాక్యమ్ములఁ
నరుడపుడాలించి భక్తినమ్రుండై కాఁ
తరతమదిగదుర గరపం
కరుహమ్ములు మోడ్చి పల్కఁగానాగ నొగిన్. 126

గీ॥ మాధవా నీదుకీర్తి సమస్తజగము
లెల్లమోదించె రాక్షసులెల్ల దిశల
బారుచుండిరి సిద్ధులేర్పడనుతింపు
చుండిరయ్యది యుక్తమైయుండుఁగాదె. 127

గీ॥ ఘనుడవైనట్టి నీకుజగన్నివాస
సిద్ధనతులబ్బుటదియేమి చిత్రమయ్య
యిందిరాధవ జగములకెల్ల నీవు
హేతుభూతుండవైతి వబ్జాతనేత్ర. 128

గీ॥ పరమపూరుష సర్వప్రపంచమునకు
గారణుండవు నీవె నిక్కంబుగాను
యిందిరాధవ నీసత్వమెన్ననాకు
తరమె చంచలగుణగణోత్కరుడ కృష్ణ. 129

చ॥ అనలయమమాగ్నిహోత్రవరుణాబ్జ పితామహులన్న నీవెకా
ననతిసహస్రమిచ్చెద గొనంగదవయ్య మహాత్మ యింకనొ
క్కనతి మరొక్కడౌనతియు కంజదళాక్ష యొనర్చువాడ నా
తనివికదీరకుండె ప్రముదంబున నిచ్చెద పెక్కులౌనతుల్. 130

వ॥ అని పలికి యర్జునుండు దామోదరునిగ్గాంచి దేవా సమస్తభూ
తాంతర్యామివై సర్వజగద్వ్యాప్తుండవై సకలవిశ్వాత్ముండవై వి
శ్వరూపివగు నీకు పురోభాగపృష్ఠప్రదేశ పార్శ్వభాగంబుల నమ
స్కరించెదనని మరియు నిట్లనియె 131

సీ॥ మహితాత్మ నీదగు మహిమ గన్గొనలేక
మిత్రుండవనినిన్ను మేలముగను
మందుండనగుచు ప్రమాదమ్ముచే గృష్ణ
యాదవాయని పిల్చితప్పుడపుడు
కూరుచున్నప్పుడుఁ గుడిచెడివేళను
పవళించుతరిన నేర్పడగ మిత్ర

సముదయమ్ములఁ సమక్షమ్మున నినుఁ బరి
హాసంబుజేసితి నబ్జనాభ
గీ॥ ఇట్టినన్నుసైచి బ్రోవుమో యిందిరేశ
యనుచుఁ జింతించుటకును శక్యమ్ముగాని
పరమపూరుషు దివ్యప్రభావశాలి
నిన్ను వేడుచునుంటినో నీరజాక్ష. 132
గీ॥ జగములన్గల యీచరాచరములకును
తండ్రివిగఁ బూజ్యుఁడవు గురూత్తముఁడ వీవు
పుండరీకాక్ష నీవతుల్యుండవౌట
కొండొకఁడుగాఁడు నీకన్న గొప్పవాఁడు. 133
గీ॥ పతినిఁ బతి దేశికుఁడు నిజచ్ఛాత్రు జెలిమి
కాని జెలికాఁడు మన్నించుకరణి మాను
కాపరాధముల నైనఁపుమాయటంచు
వేఁడుచుంటిని నతులుగావించినిన్ను
కదనరంగవిలాస జగన్నివాస. 134
చ॥ ఇనశశినేత్రకృష్ణ పరమేశ్వర తావకరూపమెన్నఁడుఁ
గనుగొనకిప్డు గన్గొనఁగఁగాతురుఁడైతిని కాన కృపనీ
మునుపటిరూపమున్మరల మోదముగాఁ దయతోడఁజూపుమా
వనరుహసంభవాది సురవర్గనతాంఘ్రిపయోరుహద్వయా. 135
క॥ మునుబలె మకుటము ధరి దర
మునుగల నీకృష్ణరూపముఁ జూపుము నా
మనముచలించెనుపోషిత
సనకాదిమునీంద్రచయ ప్రసన్నుఁడవగుమా. 136
మ॥ గదచక్రమ్ముకిరీటముఁ గరచతుష్కంబొప్పి భక్తాంబకా
భ్యుదయమ్మై వెలుగొందుచుండిన భవత్పూర్వాకృతిఁ జూపి నా
మొదకు నోమ్మదముగొల్పవే సకలలోకేశా రమాధీశన
వ్యదరస్మేరముఖా జగజ్జనక కృష్ణా ద్వారకానాయకా. 137
వ॥ అని పలికిన కౌన్తేయున కనంతుం డిట్లనియె
సీ॥ స్థిరబుద్ధి వినుపార్థ తేజోమయం బాద్య
ముఖిల ప్రపంచరూపాత్మక మ్మ

నంత మవ్యయము వేదాంత నిధానమ్ము
నారూపమిది కురువీరనీకు
దక్క యజ్ఞాగమాధ్యయన తపోయోగ
మహిమల నొప్పిన మర్త్యులెవరు
కనుగొనజాల రుగ్రంబైన నారూప
మారసి భీతిల కాత్మయందు

గీ॥ మోహమున్వీడి తొల్లింటి మూర్తిగనుము
సంతసముజెందగలవు నిశ్శంశయముగ
ననుచు హరి పూర్వరూపమాయర్జునునకు
జూపి యాతని భయమూడ్చెజూనృపాల. 139

వ॥ అంత పార్థుండు సంతసించి కృష్ణునిగాంచి యిట్లనియె.

గీ॥ దేవదేవేశ శ్రీశత్వదీయమైన
సౌమ్యమానవరూపంబు సంతసమున
గాంచితిన్ వీడె నామదిం గాతరతయుం
దేవకీపుత్ర వికచ రాజీవనేత్ర. 141

వ॥ అని పలికిన దామోదరుం డిట్లనియె.

గీ॥ పార్థ కడుదుర్నిరీక్ష్యమై బరగుచున్న
యట్టి నారూపమరసితి వట్టిరూప
మమర బృందమ్ము సంతత మరయగోరు
కొనుచు నుందురు పాండురాట్తనయ సునయ. 143

గీ॥ పలుకులేటికి పదివేలకొలదిగాను
పార్థ నీవిపుడుగనిన రూపమ్ము వివిధ
దానవేద తపోయాగతతులచేత
గాంచగాలేరు నరులు నిక్కమ్ముగాను. 144

గీ॥ నన్నెరుంగుటకుఁ గనఁగ నన్ను
గలయ యత్నించు మానవాగ్రణికి స్థిరత
భక్తియే సాధనములగు పాండుతనయ
దానికన్నను మిగుల మేలైనదెద్ది. 145

గీ॥ నాకొరకు గర్మములు సల్పినన్ను పరుని
గాదలంపుచునను గొల్చి నరుడుసంగ

రహితుడై ననునర్జ జెందు రాజపుత్ర
తద్విధముగాకనర్జ జెందదలమెమిత్ర. 146

## ద్వాదశోఽధ్యాయము.

—( భక్తియోగము. )—

వ॥ అనినపార్థుం డిట్లనియె. 147

గీ॥ ఎవరునీయందు కడునిష్టదవిలిభక్త
వర్యులై గొల్చుచుందు రెవ్వారుసతము
బ్రహ్మమున్ గొల్చువార లవ్వారిలోన
నుత్తములెవారు దెల్పుమో యోగివంద్య. 148

గీ॥ శ్రద్ధతో భక్తితోడ నిశ్చలతరముగ
దనరు చిత్తము నాయందు దనరజేసి
నన్ను గొల్చినవారలే నాకుదగిన
వారు ధ్రువముగఁ గుంతీకుమారశూర. 149

సీ॥ ఇంద్రియమ్ములను జయించి యశేషభూ
తహితత్వము ననుదా దనరి శబ్ద
రూపవిహీనమై వ్యాపితాశేష ప్ర
పంచమై చింతింపబడక నెప్పుడు
మాయనధిష్ఠించి మహితనిశ్చలతను
సత్యమ్ము నిత్య మక్షరమునగుచు
బరగిన పరునిన న్నాజిఁగినసిద్ధులు
నన్ను సేవింతురన్నా కిరీటి

గీ॥ కాన నవ్యక్తకాంక్షులై గ్రాలువారి
కధికతరమైన కష్టము లావహిల్లు
కారణమ్మన్న నవ్యక్తగతిసుఖంబు
గానుబడయరు దేహాభిమానులగుచు. 150

గీ॥ తమదు కర్మచయంబు చిత్తమ్ముపార్థ
నాయెడర్జ న్నిల్పి నన్ను ధ్యానంబుజేయు
వారలర్జ మృత్యుసహితసంసారవార్ధి
నుండి వేవేవదీయుచునుండువాడ. 151

గీ॥ అట్లుఁగావున పార్థ నాయందు నీదు
చిత్తమున్నిల్పి కడకు నన్నెందుమయ్య
నీకు నాయందు చిత్తము నిలువదేని
యోగమున జెందగలవు నన్నో కిరీటి. 152

క॥ వాసవతనూజ యోగాభ్యాసము శ్రమమైనకర్మమస్మదర్థమున్
జేసిన ననుజెందెదవీవాసరణిం జేయజాల నన్నన్వినుమా. 153

గీ॥ స్వాంతము న్నిగ్రహించి నాశరణుజొచ్చి
కర్మఫలములు వదలి నిష్కామివగుచు
నన్ను భజియింపుమీ నీకు నవ్యమోక్ష
పదము జేకురు పాండుభూపాలపుత్ర. 154

సీ॥ అర్జునావినుము యోగాభ్యాసమునకన్న
జ్ఞానమ్ము శ్రేష్టమ్ము దానికన్న
ధ్యానముత్తమమగు దానికన్న నర్మ
ఫలముల వీడుట వెలయ మేలు
దానఁ జేకురును శాంతియు నట్టిశాంతిచే
సకలభూతమ్ముల సమతజూడ
గలుగు నంతట నహంకారమ్ము మమకార
మడగును దాన మహాత్ముడగుచు

గీ॥ ద్వంద్వముల నెల్ల సమముగా దలచియును బ్రి
మాద మిసుమంతగనక నామీద నమ్మ
కమున నన్గొల్చి నాకిష్టతముడు నగుచు
బఱగునో మిత్రి పాండుభూపాలపుత్రి. 155

గీ॥ పార్థ యెవ్వానిచేత ప్రపంచమెల్ల
భయము క్షోభంబు గనదో ప్రపంచమునను
తాభయమ్మును క్షోభమ్ము దాల్పబోడో
వాడు నాదగుహితుడు ధృవంబుగాను. 166

గీ॥ దక్షుడాచారపరుడు నపేక్షలేని
వాడుదాశీనుడపగతవ్యధుడువిగత
కార్యుడెవ్వడో వాడెనిక్కంబుగాను
నాకుహితుడౌను పాండుభూనాథపుత్ర. 157

గీ॥ ద్వంద్వములను సమానభావమున దలచి
యంచితంబుగ జ్ఞానముగాంచి నన్ను
నిశ్చలతఁ గొల్చుచుండెడి నిపుణుఁడెవఁడొ
వాడె నాకు హితుండు ధృవంబుగాను. 158

సీ॥ శత్రులయెడఁ బ్రియమిత్రులయెడ సమ
భావంబు గలిగిన భవ్యమూర్తి
మరియును మానావమానముల్ద్రోచిన
నుబ్బుచు పెన్వగ నుండబోక
సర్వసంగత్యాగ సద్భాగ్యశాలియై
యవహితమానసుడగుచు భక్తి
కలిగి సన్ధ్యానించు ఘనుడు నా హితుడగు
నింద్రజా యికపల్కులేల పెక్కు

గీ॥ యాధినే దెల్పు ధర్మస్వరూపమెవరు
చిత్తనైశ్చల్యమున నుపాసించి శ్రద్ధ
గలిగియుండి మదాసక్తిగలిగినాకు
భక్తులగుదురో వారె నాపరమహితులు. 159

వ॥ అనిన విని సంజయా తరువాత వృత్తాంతము దెల్పుమని యాంబి
కేయుం డడుగుటయు

మ॥ కరుణామానస సజ్జనప్రచయముఖ్యాసత్య సంకల్పకీ
ర్తిరమాయుక్త గుణాక్త ధర్మపథవర్తీ శాంతమూర్తీ నిర
స్తరజస్తామస నిందితాఘనిచయాధైర్యామరాద్రీ మహ
త్తర సమోద మనోంబుజాత సుకృతాత్మా పాలపత్త్యన్వయా.

క॥ ధరణి సురాన్వయామృత । శరనిధిసంజనిత పూర్ణచంద్రబుద్ధి ని
ర్జరదేసిక పురుషోత్తమ । చరణాబ్జధ్యానలాలసా సువిలాసా. 161

మాలిని॥ శమదమగుణజాలా । సంతతానందఖేలా
విమలసుమతపాలా । వేదవిద్యావిలోలా
సమహిత గుణభూతా । సత్యవిజ్ఞానపూతా
కమలజకులజాతా । కల్మషాంభోదవాతా. 162

గద్య॥ ఇది శ్రీమునుప్పల వెంకటేశ్వర ప్రణీతంబైన
కృష్ణగీతయందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీకృష్ణాయనమః

# శ్రీకృష్ణగీత.

## త్రయోదశోఽధ్యాయము.

## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము.

### తృతీయాశ్వాసము.

క॥ శ్రీవత్సనగోత్ర పవి
త్రావిల సత్పుణ్యకార్య తత్పరధరణీ
దేవాగ్రణి శంకరపద
సేవాపర పాలపర్తి శ్రీరామాఖ్యా. 1

వ॥ దేవా యవధరింపుమని యాంబికేయునిఁ గూర్చి యిట్లనియె. నట్లుఁ బలికిన జలజలోచనునకు పార్థుండిట్లనియె. 2

గీ॥ ప్రకృతియన నెద్ది పురుషుడెవ్వాడు క్షేత్ర
మనఁగ నెయ్యది క్షేత్రజ్ఞుడనగ నెవఁడు
జ్ఞానమెయ్యది జ్ఞేయమేచందమైన
దని వచించిన నరునకా హరివచించె. 3

గీ॥ చెలిమికాడ శరీరమ్ము క్షేత్రమనియు
దాని నెరిగినవాడు క్షేత్రజ్ఞుడనుచు
తత్వవిదులు వచింతురు క్షేత్రజ్ఞుఁ దెలియు
వాడు నన్నెలియువాఁడు ధృవంబుగాను
క్షేత్రములనెల్ల సేవసించియుంట. 4

ఉ॥ క్షేత్రముక్షేత్రభేదమును క్షేత్రవికారము క్షేత్రజన్మముఁ
క్షేత్రమెఱింగియుండిన ప్రసిద్ధుని వాని ప్రభావముఁ బృథా
పుత్రక సంగ్రహంబుగను పూనివచించెద నాలకింపుమా
పాత్రుడవీవుగాన దెలుపఁ దగు నాకనిదోచె నెమ్మదిన్. 5

గీ॥ అర్జునా బ్రహ్మసూత్రపదాళిచేత
వేదములచేత మునులచే వేరువేర
నిర్ణయింపంగబడియెను నీవు వన్న

ప్రశ్న జేసిన క్షేత్ర మేర్పడగ వినుము. 6

సీ॥ పంచభూతమ్ములు ప్రకృతిమూలమ్ముల
హంకార మఖిలేంద్రియములు బుద్ధి
శబ్దాదివిషయసంచయము రాగద్వేష
ములును మహత్తత్త్వమును దలంప
సౌఖ్యదుఃఖములు వెసఁ జేతనాధృతుల్
గలయది క్షేత్రముగాదె నీకు
చెలిమిమైఁ దెల్పిన క్షేత్రమ్ము నాదగు
దానికి నియమవ్రతములు వినుము

గీ॥ దంభమాత్మస్తుతియు లేక దనరుటయును
స్థైర్యము శుచిత్వమోర్మియార్జవమహింస
దేశికోపాసనమ్మని దెలియుమయ్య
సద్గుణనికాయకౌన్తేయ శాంతిగేయ 7

వ॥ అదిగాక విషయాభావనిరహంకారములవలన జన్మమృత్యు జరా
రోగాదుల ననుసరించిన దుఃఖమును దోషమునుగనిపెట్టుట కవ
కాశముండును. 8

గీ॥ విషయసక్తుండుగానట్టి విబుధవరుఁడు
దార యడల కుమారకాగారములను
వాంఛవీడును దానిచేవరలు సౌఖ్య
మనుభవింపంగగలఁడు సత్యమ్ముగాను 9

గీ॥ అరయ నేకాంతభక్తిసర్వాత్మదృష్టి
గలిగి విజనాశ్రమమున నన్గొలుచుచుండి
ప్రాకృతులయందు మోహములేక వెలుఁగు
వాఁడు సర్వోత్తముఁడు సురవరకుమార. 10

గీ॥ జ్ఞానమింకెట్టి దనగనో సవ్యసాచి
యరయ నధ్యాత్మవిషయమైనట్టి మోక్ష
మన్నిటికి శ్రేష్టమనియెంచు టదియునేర
కున్న నజ్ఞానమని బుధులెన్నుచుంద్రు. 11

గీ॥ ఏది దెలియంగదగినదో యేదెరింగి
నరుడు మోక్షమ్ముగాంచునో నరుడదా?

తెలియజేసెదవినుమదే తెరగటన్న
సత్తుగాదది సఖుడయసత్తుగాదు
పరగనదియె సనాతనబ్రహ్మమగును. 12
గీ॥ కవ్వడీ యెటులగాంచిన గాళ్లుచేతు
లెటులజూచి నమస్తము లెటులగనిన
గనులు ముఖములు గర్ణమ్ముగ్లిగిజగము
లందువ్యాపించెనట్టి బ్రహ్మంబుఁబేర్మి. 13
సీ॥ సంగంబు లేనిదై సర్వంబు భరియించు
గుణహీనమై కాంచు గుణచయంబు
నింద్రియశూన్యమై యింద్రియమ్ములను భా
సిలజేయుచుండు ప్రసిద్ధముగను
సంతతమ్మఖిలభూతాంత ర్బహిస్థల
వ్యాప్తమయ్యుచరాచరాక్త మగుచు
నజ్ఞానవంతుల కతిదూరమైజ్ఞాన
వంతులౌవారి కుపాంతమగుచు
గీ॥ సూక్ష్మమై భూతములయందు జొచ్చిభేద
హీనమైయుండి భేదముగా నెయుండు
ప్రళయమునమ్రింగుచుండి ప్రపంచసృష్టి
తరుణమున పెక్కురూపముల్దాల్చి భూత
ములనుబోలిన దానిని దెలియనగును. 14
గీ॥ అంధతమసమ్మునకుపరంబగుచు సూర్య
చంద్రముల నెప్డు వెలిగించు జ్ఞానమనగ
జ్ఞేయవస్తువు దానివీక్షింపగాను
జ్ఞానమే సాధనమ్మగు సవ్యసాచి
తలపనదియెల్లవారి స్వాంతములనుండు. 15
సీ॥ జ్ఞేయమ్ము జ్ఞానమ్ము క్షేత్రవిధమ్ము క్షే
త్రజ్ఞువిధము సంగ్రహముగాను
దెలిపితినయ్య మదీయభక్తుడు దీని
దెలిసి బ్రహ్మత్వముగలిగియుండ్రు
పురుషు డనాద్యుండుపరికింపప్రకృతియు

# తృతీయాశ్వాసము.

ట్టిదెయంచు దెలియుమా హృదయమందు
నారయ దేహేంద్రియాదివికారముల్
గుణములు మూడు తద్గుణవికార
గీ॥ ములు సుఖమ్ములు దుఃఖముమ్ములున్నగలుగు
నట్టివెల్లను ప్రకృతిచేఁబుట్టినట్టి
వానిగాదెలిసికొనుము భావంబులోన
శాస్త్రవస్మయవారిదశ్వసనపార్థ 16
గీ॥ కార్యకర్తృత్వమునకును కారణమున
కరయహేతువుఁ ప్రకృతియై బఱగుచుండు
సుఖముదుఃఖము ననుభవించుటకుహేతు
భూతుడాజీవుడనుచుంద్రు బుధులుపార్థ 17
గీ॥ ప్రకృతికార్యశరీరియై ప్రకృతిగుణచ
యానుకూలమ్ముగా శోకహర్షతతుల
ననుభవించును జీవుడోయనఘ సకల
జన్మకారణములుగుణ సంగమములు. 18
గీ॥ సర్వముభరింపజాల్మహేశ్వరుడు భోక్త
భర్తయగుచు శరీరసంవాసియగుచు
నుండు పరమాత్మ పార్థ జీవుండు తా శ
రీరియైయున్న నాత్మకు వేరునుండు. 19
గీ॥ అట్టిజీవున కన్యుడైనట్టి పురుషు
ప్రకృతి గుణములగూడి యెవ్వాడుగనునో
వాడు జన్మమ్ము గనడు ధృవంబుగాను
భరతరాజకులార్ణవ పంకజారి. 20
సీ॥ ధ్యానంబుచేత కొందఱు మానసంబుచే
కొందఱు యోగులై కొందఱెన్న
సాంఖ్యులైకొందఱు సంతతము న్గర్మ
యోగులై కొందఱు నోయిపార్థ
కనుగొనుచుందు రాక్రమమెరుంగనివారు
కొందఱు భక్తులు గురులచేత
బోధింపబడి నిజబుద్ధులకొందఱు

క్షేత్రజ్ఞ సంయోగము వలన గల్గు
యంతకు నప్ప వేరు లేదయ్య సఖుడ.

ర్జునా వీను సచరాచరార్థ మెల్ల
నరయ క్షేత్రజ్ఞయోగము వలన గల్గు
నంతకు న్దప్ప వేరు లేదయ్య సఖుడ. 21

గీ॥ సఖుడ సర్వభూతసముడై ప్రపంచభూ
తములు జెడిన గాని తాను జెడక
వెలయు దేవదేవు వీక్షించు నాతడు
మంచి చూడ్కి గల్గుమానవుండు. 22

గీ॥ నిఖిల భూతసమానుడై నెగడు చున్న
యట్టి పరమాత్మ గన జాలునట్టి జ్ఞాన
మును వినాశన మొనరింపకను జెలంగు
పూరుషుడు గాంచు మోక్షము వీరమాళీ. 23

గీ॥ ప్రకృతి చేత నొనర్పగా బడిన కర్మ
కాండమున నాత్మ తా గర్త గాదటంచు
దెలియు వాడందు మోక్షము దెల్లముగను
నిర్జితారాతినిచయగాండీవపాణి. 24

గీ॥ పాండుపుత్ర మహేశ్వరప్రకృతియందు
దనరు చుండెను భూతభేదంబులనుచు
విపుల బుద్ధి నెరింగిన నిపుణుడెన్న
గాంచు బ్రహ్మత్వమంది సౌఖ్యమ్ము సుమ్ము. 25

గీ॥ నిర్గుణంబైన కతమున నిత్యమగుట
నాద్యమై యుంటచే పరమాత్మ నిఖిల
గాత్రముల నుండినన్ నిర్లిప్త కర్మియగును
కర్మ బంధము లయ్యది గాంచబోదు. 26

గీ॥ సర్వగతమాకసమ్ము సూక్ష్మమునలీన
మెటులగాకుండు నోయాత్మ యటుల నిఖిల
గాత్రములనుండినన్ గుణకాండమునకు
దోషసంచయమున కును దూరమగును. 27

చ॥ కమలవనాప్తు డొక్కడె జగన్నిచయం బను వెలుంగు చేయునో

శమున వెలుంగ జేయువిధి సంతతమున్పరమాత్మ తాశరీ
రముల వసించి భూతముల రాజిలజేయును పార్థ దీనిజ్ఞా
నమున నెరుంగు కోవిదుడు నవ్యతరంబగు మోక్షమందడే. 28

వ॥ అని పలికి గోవర్ధనధరుండు పార్థునకిట్లనియె. 29

గీ॥ వినుము కౌన్తేయ క్షేత్రజ్ఞవిధము జ్ఞాన
దృష్టిచే నేమహాత్ముండు దెలిసికొనునో
వాడు చేకొనఁగలఁడపవర్గసుఖము
భంజితారాతి సముదాయ పాండవేయ. 30

---

చతుర్దశోఽధ్యాయము.

— గుణత్రియవిభాగయోగము. —

గీ॥ మునులు దేనినెఱింగియిమ్మగశరీర
బంధముల్ బాసి మోక్షము బడయఁగలరో
దాని నుత్తమమైన సుజ్ఞానమును వ
చింతు వినుమయ్య కౌన్తేయ శాంతిగేయ. 31

గీ॥ అట్టిధర్మము పండితులాశ్రయించి
పరమమైనట్టి ధర్మము నెఱిఁగిసృష్టి
సమయమున జన్మమందురు సత్యముగను
ప్రళయమున ఖేదమందురు పాండుపుత్ర. 32

గీ॥ పార్థ నాకు యోనిప్రకృతియై యలరారు
నందు దాల్చువాడ నఖిలభూత
చయము నట్లుగాన సర్వసాక్షీసృష్టి
కేనెకారణుండ జూనిజము గ. 33

సీ॥ పలుకులు వేయేల పార్థ నానాయోని
భవులకు జనని బోల్ప్రకృతి నిజము
నరుఁడబీజప్రదుండను నేనె కావున
జనకుండ నౌదు నిశ్చయముగాను
ప్రకృతి సంభవములై బఱఁగుగుణమ్ములు
మూడును యీగాత్ర మునను జెలఁగు
పరమాత్మను నట్టి పడవైచుచున్నవి

కానియందలి సాత్వికమ్ము నాగ
గీ॥ గుణము నిరుపద్రవమ్మున వెల్గుచు సతమ్ము
దనరుచున్నట్టి యాత్మ వాస్తవముగాను
జ్ఞానమున గూర్చుచుండునో సవ్యసాచి
వినుము తెల్పెద నింక సవిస్తరముగ. 34
సీ॥ కవ్వడీ వినుము రాగస్వరూపంబు రా
జసగుణంబాట వాంఛలును బ్రేమ
గలిగించుచుండును కర్మమ్ముల న్జేయ
బురికొల్పుచుండు నెప్పుడు కిరీటి
యరయతమోగుణ మజ్ఞానటనితమై
నెఱిప్రమాదాలస్య నిద్రలందు
దేహినిగూర్చు సందేహమ్ములేదిది
యింక సత్వగుణమ్ము నెఱుఁగుమయ్య
గీ॥ వెలయ రాజస తామసమ్ములకు నవల
నుండి వెలుగొందుచుండునో ఖండితారి
సఖుఁడ వెయ్యేల వినుమయ్య సాత్వికమున
జ్ఞానమార్జింపగలఁడు నిజముగ నరుఁడు 35
గీ॥ అర్జునా యీశరీరేంద్రియములు జ్ఞాన
మునఁ బ్రకాశించినప్పుడే దనరు సాత్వి
కాభివృద్ధి యటంచు నీయాత్మయందు
దృఢముగా నెంచుమయ్య సందేహముడిగి. 36
సీ॥ కర్మంబు తత్ఫల కాంక్షయు గలిగి శాం
తంబు గానదూ రాజసంబు పార్థ
వెలయ లోభమె దాని వృత్తితమోగుణ
వృద్ధియైనపుడ వివేకమొకదూ
మందత నిద్ర ప్రమాద నిరుద్యోగ
ములు గల్గియుండును వెలయ సత్వ
గుణవృద్ధియైన నిక్కువముగా జీవుండు
ప్రళయావసరమున బ్రహ్మలోక
గీ॥ మాదిగా గల్గు పుణ్యలోకాళి కరిగి

విజయసుఖియా రజోగుణ వృద్ధియందు
పొలియువాఁడెన్న కర్మముల్సలుప్రకాంక్ష
గలుగువారల జన్మింపగలఁడు పార్థ. 37
క॥ కౌతుకమున వినుమయ్యా
వీతాఘచయా తమోభివృద్ధియంద
సువారితము వీడిన తిర్య
గ్జాతియందుఁ బుట్టు నరుఁడు సత్యము పార్థా. 38
గీ॥ మఱియు వినుమయ్య పుణ్యకర్మములకెల్ల
నిరత సత్వప్రధానమై నిర్మలమ్ము
నగుచు వెలసెడి భవ్యసౌఖ్యమ్మె ఫలము
కనరజఃఫలమన్న దుఃఖము తమఃప
లమ్ము జ్ఞానవిహీనమ్మ సుమ్మ పార్థ. 39
గీ॥ సత్వసంజాతమైనది జ్ఞానమనఁగ
నరయ రాజసభవము మోహమ్మ తామ
సమున బుట్టును లోభమజ్ఞానమును ప్ర
మాదమును నిద్రజాగు నిర్మలచరిత్ర. 40
సీ॥ తలపోయ సత్వప్రధాను లుత్తమలోక
గాములై సౌఖ్యముగాంచుచుంద్రు
తతరజోగుణ సుప్రధానులీమర్త్య
లోకమ్మున జన్మింప గలరుసుమ్ము
తామసగుణమే ప్రధానంబుగా గల
మనుజు లధోలోకమున వసింతు
రటుగాన గుణములకన్యుని కర్తగా
నెదఁదలంపకవీని కెక్కుడాత్మ
గీ॥ యనుచు దెలిసిన నా తేజమందవచ్చు
దేహజనితములైనట్టి త్రిగుణములను
గెలచి శోకజరామృత్యు కలిత జన్మ
ముక్తుడై! మోక్షమందు నిమ్ముగ గిరీటి. 41
గీ॥ అనిన దామోదరునకు నిట్లనియె గిరీటి
గుణములఁ గెల్చు దేహికి గుర్తులెవ్వి

యతని కాచారమేమి గుణాళి నెట్లు
తిక్రమింపంగదగు వసుదేవపుత్ర. 42

గీ॥ సత్వగుణ సంభవమ్ములౌ సౌఖ్యములను
కోరికొనక రజస్తమోగుణభవమ్ము
లైన దుఃఖాదులబ్బినయపుడు చింత
నొందకుండు గుణాతీతుడెందు సఖుడ. 43

గీ॥ తానుదాశీనుడై గుణతండమునకు
తనకు సంబంధమేమని తలచి ద్వంద్వ
ముల సమానమ్ముగా జూడగల జనుండు
గుణముల నతిక్రమించిన కోవిదుండు. 44

సీ॥ జాంబూనదంబు మృచ్ఛకలమ్ము దుఃఖము
సౌఖ్యమ్ము నిందయు సంస్తుతియును
ప్రియము నప్రియము హితచయము శత్రుచయమ్ము
మానావమానము ల్మానసమున
సమముగా నెంచును సర్వకార్యారంభ
ములు త్యజించియు ధైర్యమున జెలంగి
యేకాంతభక్తిచే నెవ్వడునన్ను ధ్యా
నింపుచుండునో వాడె నిశ్చయముగ

గీ॥ జితగుణత్రితయుడాతడు జెందునన్ను
నేననర బ్రహ్మమునకును నిరతధర్మ
మునకు నవ్యయమైనట్టి మోక్షమున క
ఖండ సుఖమునకు స్థ[illegible]గా దలంపు 45

---

పఞ్చదశోఽధ్యాయము.

— పురుషోత్తమప్రాప్తియోగము. —

గీ॥ వాసుదేవుడు మూలమై వనజసంభ
వాది దివ్యులె శాఖలై యాగమములు
పత్త్రజాలములైన యశ్వత్థమహిమ
దెలియువాడెన్నం ముక్తుడై వెలయుచుండు. 46

సీ॥ విషయపల్లవముల వెలసి గుణావళి

చేత నిత్యంబు పోషింపబడుచు
గర్మానుబంధ దుష్కామపుంజమ్మె యే
ర్పడగ మూలమ్ముగా బరిణమించి
పరగజీవస్వరూపంబులై పాపంబు
లను భూరిశాఖాచయంబు లెపుడు
మిక్కిలి క్రిందికి మీదికి బ్రాకియు
సంసార వృక్షము సవ్యసాచి
గీ॥ దనరు నయ్యది కనులచే గనగరాదు
తలప నజ్ఞానులకు దాని దెలియరాదు
తెలియకుండిన దానిని గెలువరాదు
గెలుపుజెందక మోక్షము గలుగబోదు. 47
ఉ॥ ఆరయ దెల్పువాడ వినుమజ్ఞన కోవిదుడైన వాడహం
కారము తుచ్ఛమైన మమకారమువీడి మహోగ్రమైన సం
సారము నాగభూరుహము జ్ఞానము నాదగు ఖడ్గధారచే
మారణమందజేసి వినుమా ననుజెందు సురేంద్ర పుత్రకా. 48
సీ॥ మోహ మహంకారమును వీడువారలు
పుత్రాది సంగముల్ బోనడంచు
వార లాత్మజ్ఞాన నద్ధిష్ఠులగు వార
విద్యావిహీనులు వివిధకామ
వర్జితుల్ ద్వంద్వముల్ వదలువా రస్మదీ
యావ్యయ పదమున కరుగు దెంత్రు
నాపదంబెద్ది యనన్వినంగదవయ్య
నరులు దానింబొంది తిరిగిరారు
గీ॥ ద్యుమణిచేగాని కాకచంద్రమునిచేత
గాని వెలిగింపబడదు తద్ఘనపథంబు
దాని జెందిన మనుజులు ధన్యతములు
ఖండితారాతి సముదాయ పాండవేయ. 49
వ॥ అదియునుంగాక కౌన్తేయానసనాతనంబై మదీయాంశమైన జీవి
సుషుప్తిప్రళయములందు ప్రకృతిలీనమైయున్న మనస్సు మొదల
గు నింద్రియముల నాకర్షింపుచున్నది. 50

గీ॥ కర్మవశమునఁ గొండొక గాత్రమందు
బొందువాయువు దేహ ప్రభుండు జీవు
డని లుడెన్నంగ గంధముల్ గొనుచుఁబోవు
రీతి గొనిపోవుచుండుఁ గిరీటి వినుము. 51

గీ॥ ఎలమి శ్రోత్రేంద్రియాది బాహ్యేంద్రియాళి
నాశ్రయించిన యట్టి శబ్దాదివిషయ
ముల ననుభవించు జీవుండు! వెలయదీని
నెఱిగియుండురు కోవిదు లెందు సఖుడ. 52

గీ॥ గాత్రముననుండినప్పుడు గాని వేరు
గాత్రమున కేగినప్పుడుగాని విషయ
భోగమునగాని నింద్రియంబులను జేరు
జీవునిన్ గాన రజ్ఞానభావులెల్ల
జ్ఞేయమయ్యది బుధసముదాయమునకు. 53

చ॥ కురుకులవార్ధిచంద్ర విను కొందరు నైష్ఠికయోగులైనవా
రరసి శరీరమందుగల యాత్మను వేరుగనున్నదానిగా
నెఱుగుదురాక్రమంబు నెపుడేని యెఱుంగరు మందులెల్ల సా
దరమున నాలకింపుము హితా వచియింతు మదీయ తేజముల్

గీ॥ చెలగి లోకమ్ములన్ బ్రకాశింపఁజేయు
వనజమిత్రుల తేజముల్ వహ్ని తేజ
మస్మదీయంబులగు పార్థ యవనియందు
దనరి వెలసె దతత్త్ద్విధముల మిత్ర.

గీ॥ సఖుడ రసరూపమున్గల సారసారి
నగుచు నోషధులను బెంచునట్టివాడ
నింద్రపుత్రిక నేనె నన్నట్టివాని
గా గణింపరు జ్ఞానవికలులు నరులు. 56

గీ॥ అగ్నినై దేహములనెల్ల నాశ్రయించి
యందు వసియించు ప్రాణానిలాదివాయు
గతుడనై సకలభూతయోగ్యమ్ములై ద
నరుచు నుండు చతుర్విధాన్నములొనర్తు. 57

గీ॥ వేదవేద్యుండ వేదార్థవేదినగుచు

సకలధర్మార్థములయందు సంచరింపఁ
జేయుచుంటిని భూతాళిఁ జెలఁగి యట్టి
భూతములఁ జెంది స్మృతిజ్ఞానమును హరింతు. 58

గీ॥ నరుఁడక్షరుఁ డక్షరుండను పురుషులందు
క్షరుఁడు బ్రహ్మాండగత భూతజాల మక్ష
రుండు కూటస్థుఁ డనబడుచుండు పార్థ
దీనిభేదము బుధులకు దెలిసియుండు. 59

గీ॥ ఆలకింపగదయ్య క్షరాక్షరులకు
మిన్నయగుపూరుషుం డొకఁ డున్నవాఁడు
వాఁడె పరమాత్ముఁడీలోకవాసి లోక
భారవహుఁ డాతనికి మేటివారు లేరు. 60

గీ॥ ఖండితారాతి క్షరున కక్షరునకన్న
నుత్తముఁడు గావునఁ బురుషోత్తముండు
నాఁగ వేదోక్తనాముఁడై నాఁడ తండ
నంగ నేనౌదు ధ్రువమిది సంగడీఁడ. 61

గీ॥ ఇట్టి పురుషోత్తమాఖ్యు వన్నెవ్వఁ డెఱిఁగి
కొల్చుచుండునో యాతఁడే కోవిదుండు
వాఁడు సర్వజ్ఞుఁడనబడు వాఁడు సుమ్ము
విజయభూతాళివాఁడె వివేకధనుఁడు. 62

గీ॥ అనఘ నీకిప్డు సకల రహస్య శాస్త్ర
మేను నుడివితి నీశాస్త్రమెఱుఁగు నట్టి
వాఁడు కృతకృత్యుఁడై సదావరలుచుండు
నింక నీరీతి బేర్కొన నేల సఖుఁడ. 63

---

## షోడశోఽధ్యాయము.

### దైవాసుర సంపద్విభాగయోగము.

సీ॥ అభయ మనశ్శుద్ధులాత్మ విజ్ఞానము
నిఖిల బాహ్యేంద్రియ నిగ్రహమ్ము
పర్వయజ్ఞమ్మును బ్రహ్మయజ్ఞమ్మును
జపతపస్స్వాధ్యాయ సంచయమ్ము

నెలమి ఋజుత్వ మహింసయు సత్యమ
క్రోధత్వ మౌదార్యగుణము శాంతి
పరుల దోషమ్ములు పలుకకుండుటయు లు
బ్ధత్వమ్ము లోకమువలన గలుగు
గీ॥ లజ్జయు మృదుత్వమును చపలత్వ హైన్య
మును ధృతియు నోర్పు ప్రాగల్భ్యమును మొదలుగ
గలుగు మనుజుని పండిత గణములెల్ల
బలుకుచుందురు దేవాంశ భవుడటంచు 64

గీ॥ ధంభదర్పాభిమాన క్రోధములు పారు
ష్యమున జ్ఞానముఁగల జంతుజాల
మా సురాంశముగల యదియనుచు సతము
పలుకుచుందురు పండితుల్ దెలియుమయ్య. 65

గీ॥ దైవసంపద మోక్షపదమ్ము కొరకు
నసుర సంపద కర్మచయంబు కొరకు
దనరుచుండును నీవిప్డు దైవసంప
దను గడించి జనించితి వనఘ వినుముఁ 66

గీ॥ ఆసురంబని దైవమటంచు భూత
సృష్టి భేదములుండు నా సృష్టిభేద
ముల వచించితి నేదైవమును కిరీటి
యాసురంబింక దెల్పెద నవధరింపు. 67

గీ॥ తెలియ వినుమా సురాంశజుల్ ధృతిదొరంగి
ధిరతధర్మమ్మునఁ బ్రవర్తింపలేరు
సత్యశౌచమ్ములనగ నేజాడగలుగు
నట్టివో వారెఱుంగరియ్యది ధృవంబు. 68

సీ॥ మంచులై వేదప్రమాణపురాణ ప్ర
మాణముల్ నమ్మరు మానసముల
బరికింప సృష్టికిఁ బురషాంగనాసంగ
మంబె నిక్కముగ మూలంబటంచు
దలచి మూఢులకు బోధలుజేసి వారల
జెడదలంతురు తారు జెడుటగాక

కవ్వడీ పుణ్యుల కథలబద్ధములని
పలుకుచు బహుళ పాపములు జెంది
గీ॥ నారకమ్ముననఁ గర్కశ క్రూర కాక
ఘూక ముఖబాధితాంగులై గుందిమరల
జన్మమందుచు దుష్పథచారులగుచు
మరల నేతెంతురా ఘోరనరకమునకె. 69
గీ॥ అల్పమానసులై నాస్తికాగ్రగణ్యు
లగుచు లోకక్షయార్థులై యవనిఁగర్మ
ముల నోనర్పఁగ బలుజన్మములను బొందు
చుందు రసురాంశసంభవు ల్పగుణహృదయ. 70
గీ॥ వినుము దుర్భరకామము ననుసరించి
దంభమభిమానమును దుర్మదంబుగలిగి
శౌచహైన్యవ్రతమ్ములు సలుపుచును దు
రాగ్రహంబున వర్తింతు రజ్ఞులెల్ల. 71
సీ॥ అజ్ఞనా యపరిమేయంబైనయట్టి చిం
తను చచ్చువరకుఁ దా రనుసరించి
రాగకార్పణ్యపరాయణులై కామ
సౌఖ్యములొందుటే చాలుననుచు
జ్ఞానహీనత దురాశాపాశబద్ధులై
యన్యాయ్యమున ధనమార్జనమ్ము
సేయుమానవులు నజ్ఞాందరాయజ్ఞుల
కతిదూరసంచారినగుదు నేను
గీ॥ వారికిఁ గర్మబంధము ల్వదలకుండు
వారునాస్తికులనబడు వారు బుధులు
గారు జన్మాది దుఃఖసంభారవహులు
వారి యజ్ఞానమునకెన్న మేరలేదు. 72
సీ॥ లాభించె నియ్యది లభ్యమ్మగానట్టి
దానిబొందెదనంచు దలచువాఁడు
ధనముండె నాకిక ధనములభింపగా
గలదని నెమ్మది దలచువాఁడు

వీని జంపెదనింక వేరొక్కనిన్ జంప
గలనని వ్యర్థుఁడై దలచువాఁడు
బలినిసిద్ధుఁడ భోగపరుఁడ నీశ్వరుఁడను
ధనికుండ నేనని దలచువాఁడు
గీ॥ దాత నుత్తమకులజుఁడఁ ధరణి నాకు
గలరె తుల్యులు నేఁ గార్యకర్తననుచు
నిత్యసంతోషిననుచు దాఁనిక్కముగను
నూహగొనుచుండు నజ్ఞానమోహితుండు. 73

వ॥ ఇట్లు జ్ఞానభ్రంశులగు వారెల్లరు చిత్తభ్రాంతిచేఁగామభోగాసక్తు
లగుచు నారకమ్మున గూలుచుందురని వనజలోచనుం డర్జునున
కిట్లనియె.

సీ॥ కొండంతవారము కోవిదాఖ్యులమని
చెలగి యాత్మస్తుతుల్ జేసికొనుచు
కృతయజ్ఞులము వినిర్జితపాపులము సోమ
యాజులమని పండితాగ్రణులము
సాంగవేదులమని సతతమ్ము దంభము
దర్పమ్ము జెలగ వ్యర్థమ్ముగాను
మాటలాడుచునుఁ గామక్రోధముల నాశ్రి
యించి కర్మముల గావించుచుంద్రు
గీ॥ నరుఁడ నన్నాత్మలోపల మఱచి నేను
నేను నేనను మానవహీనులను ధ్రు
వంబుగా నసురయోనిచయంబు నందు
నంచితంబుగ నేనె పుట్టించుచుందు. 75

వ॥ నన్ను ద్వేషింపుచు మరచుచు నావలన నగుకార్యమ్ములు తమ
చే నగుచున్నవని తలచు నరాధము లధోలోకమునొందుచుందు
రని గోవిందుడు పురందర నందనున కిట్లనియె 76

గీ॥ అసుర యోనులఁబుట్టిన యట్టివార
లెన్నిభవముల కేని నన్నెఱుఁగలేరు
వారు పుట్టుచు చచ్చుచు ఘోరనార
కమ్మునకు జేరుచుంద్రు నిక్కముగ పార్థ. 77

సీ॥ మహితాత్మ వినుము కామక్రోధలోభముల్
                నారకద్వారములనఁ జెలంగు
నటుగావునన్ వానినాశ్రయించిన వార
                లాసురయోనులయందు బుట్టు
చుందురు కోవిదులెందేని నీతిఁగా
                మ క్రోధలోభముల్ మానసముల
నుండగానీక విధ్యుక్తమ్ములగాఁ మద
                ర్థమ్ముగాఁ నిఖిలకర్మము లొనర్తు
గీ॥ వారె దేవాంశభవులు ధృవంబుగాను
వారికబ్బును మోక్షమవ్యాహతముగ
గానఁ సత్వప్రధానతఁగగలుగువారు
కర్మబంధమ్ములన్ బాయగలరు సఖుఁడ. 78
గీ॥ మనుజుఁడెవడేని శాస్త్రధర్మమ్ము సుంత
దెలియలేక యథేచ్ఛవర్తించెనేని
జ్ఞానమున్ గానఁ డతడు మోక్షమ్ముగనఁడు
సౌఖ్య మంతకు గానఁడో సవ్యసాచి. 79
గీ॥ తలపఁ గర్తవ్యమునకకర్తవ్యమునకు
శాస్త్రమే సత్ప్రమాణము సవ్యసాచి
కావునన్ తత్ప్రమాణము నీవుగాంచి
కర్మములసల్పు నందిత ధర్మరాజ. 80

---

సప్తదశోఽధ్యాయము.

— శ్రద్ధాత్రయవిభాగయోగము —

వ॥ అనిన పౌరందరి ముచుకుందావనున కిట్లనియె
గీ॥ తామరసనేత్ర శాస్త్రమతంబువీడి
నరుడొనర్చెడి కర్మమేకర్జమైన
దట్టి కర్మము గుణములయందు దేని
నాశ్రయించును దెల్పగదయ్యనాకు. 82
వ॥ అనిన నమ్మురమర్దనుండు కిరీటి కిట్లనియె నర్జునా భూతముల నెల్ల
సత్వరజస్తామస గుణంబు లావరించియుండు నందు సత్వమున

శ్రద్ధఁగలుగుచుండుఁ నట్టి శ్రద్ధ త్రిగుణంబులయందు లీనమైయుం
డి తద్గుణానుకూలంబుగా దేహులకార్యమ్ములయందు నియోగిం
చుచుండు నింతకు పూర్వజన్మసంస్కారంబునఁ జేసి యేభూతం
బున కేగుణంబలవడియున్నదో యాభూతంబుచే నాగుణంబున క
నుకూలంబుగా కార్యములయందా శ్రద్ధయే నియోగించునని మ
ఱియు నిట్లనియె. 83

గీ॥ సాత్వికులు దేవతలను రాజసులు యక్ష
రాక్షసుల తామసులు భూతరాజిఁ బ్రేత
నాయకుల గొల్చుచుందు రన్నా కిరీటి
వేడ్కఁ నేదెల్పబోయెడి విధము వినుము. 84

సీ॥ కామరాగము లహంకారదంభమ్ములు
గలిగి శాస్త్రీయమ్ముగాని యట్టి
తపమునొనర్చి భూతమ్ములయందు నం
తర్భావమొంది సంతతము వెలుగ
ననుఁ గృశింపగజేయు మనుజాధములను రా
క్షసభావులనుచు వెసఁ గిరీటి
దెలియుమువారికి గలుగదు సత్వప్ర
ధానతవినుము పార్థా వచింతు

గీ॥ వివిధభూతమ్ములకు మూడువిధములగను
నైచు నాహారములు నిట్లె సవతపోవి
తరణముల్ మూఁడువిధములై దనరుచుండు
వానిభేదములఁ దెల్పువాడ వినుముఁ 85

వ॥ పార్థా ఆయుస్సత్వ సౌఖ్యారోగ్యప్రీతుల నభివృద్ధినిఁ జేయజాలు
రసవంతంబులగు పదార్థమ్ములు సాత్వికులకు భోజ్యంబులు దుఃఖ
శోకరోగప్రదంబులగు కట్వామ్లలవణతీక్ష్ణపదార్థమ్ములు రాజసులకు
భోజ్యంబులు జాముక్రిందవండబడి సారహైన్యంబులై దుర్గంధ
పూరితమ్ములైన పర్యుషితాన్నంబాదిగా గలుగు పదార్థములు
తామసులకు బోజ్యమ్ములని మఱియు నిట్లనియె 86

గీ॥ అరయ ఫలకాంక్షబోనాడి యాచరించు
నట్టి యజ్ఞము విధ్యుక్త మనగబడును

విజ్ఞులుగ్ దానిసాత్త్విక యజ్ఞమండ్రు
కానఁ గర్మము కడు సాత్త్వికమున సల్పు. 87

గీ॥ ఫలములన్గోరి మిగుల దంభమ్ముఁబూని
సలుపు యజ్ఞముగడు రాజసమున జేయు
యజ్ఞమనబడుచుండు భూధాళిచేత
నవని వరమాన్యభరత కులాగ్రగణ్య. 88

సీ॥ విధ్యుక్తమెఱుఁగకఁ విప్రులనన్న పా
నాదులదనుప కనాసురమున
వర్తింపుచును మంత్రవర్జితమ్ముగ నద
క్షిణముగాయజ్ఞముల్ జేసిరేని
కౌన్తేయ పండితాగ్రణులచేఁ దామస
యజ్ఞమనంబడు నయ్య మఱియు
సురధారుణీ సురగురుతత్త్వవేత్తల
నర్చించి బ్రహ్మచర్యాశ్రమము

గీ॥ హింసవీడిన మనుజుడ హీనుడండ్రు
వానిదితపస్సటంచు సుజ్ఞానులండ్రు
వానికబ్బును సవ్యాకైవల్య పదము
వానితో సాటితక్కొరుల్ గానివారు. 89

గీ॥ వేదమభ్యాసమొనరించి విజ్ఞులకును
సత్యవంతులకు న్గనసహ్యాములగ
భయవిరహితమ్ముగా నుడుల్ బల్కనేర్చు
వాడు వాఙ్మయ తపమున వరలువాడు. 90

గీ॥ మానము మనఃప్రసాద సౌమ్యతలునాత్మ
నిగ్రహముగల్గి జ్ఞానియై నెగడువాని
తపము మానసతపమని తజ్ఞులెల్ల
బలుకుచుందురు పార్థ ధృవంబుగాను. 91

వ॥ ఈరీతిగా త్రివిధతపోవిధానములయందు శ్రద్ధగలిగి ఫలాపేక్షవదలి
యేకాగ్రమానసుండై యొనరించువాని తపస్సు తపస్సనంబడు
నని మఱియు హరి యిట్లనియె. 92

సీ॥ జనులచే గౌరవసత్కార పూజలు

గొనుటకై దంభము ననుసరించి
పలుపు తపస్సు రాజసతపస్సది ఘణి
కమ్ము దానికి నియమమ్ము గలుగ
దవివేక జనిత మహాగ్రహమ్మున పర
పీడార్థ మెపుడు గావించునట్టి
దరయ తామసతపస్సని కోవిదాళుల
చేత సత్యముగ వచింపబడునుఁ

గీ॥ పార్థ వినుము పరోపకారార్థమైన
దానమెన్నంగ సత్వప్రధానదాన
మనబడు న్బుధులచేత నెల్లప్పుడింక
ననఘ రాజ సదానమెల్లనగ వినుము. 93

గీ॥ కవ్వడీ వినుము ప్రత్యుపకారమునకు
గాని ప్రతిఫలకాంక్షయుగలిగి గాని
కష్టముగఁ జేయుదానమో ఖచరనాథ
తనయ ధృవముగ రాజసదానమగును. 94

గీ॥ పార్థ దేశకాలపాత్రముల్ మంచివి
గాని యపుడుఁ జేయుదానమెన్నఁ
దామసప్రధానదానంబటంచని
పలుకుచుండు సతముఁ బండితాళి. 95

వ॥ పార్థా దానభేదంబులింకను దెల్పెదను వినుమది యెట్లనిన నోం తత్ సత్ అను మూడు ను బ్రహ్మ నిర్ధేశంబులు వానినుపకరణంబులగా జేసికొనిన బ్రహ్మచేత సృష్ట్యాదిన బ్రాహ్మణులు వేదములు కర్మములు క్రమంబుగా సృజింపబడినవందో మనుప్రణవోచ్చారణచే నల్బు బ్రహ్మవేత్తల యజ్ఞదానములు విధ్యుక్తంబులు తత్ అను వాక్యోచ్చారణచే నిష్కాములగువారిచేత ననేకయజ్ఞంబులు దానములు తపస్సులు చేయబడును సత్ అనునది సాధుభావములయందు సద్భావములయందు లీనమై సత్కర్మములఁ బరగు మంగళకర్మములకు దగియుండును శ్రద్ధాభావములగు కర్మములెల్లను సత్తుగాదని యెఱుంగుమట్టి కర్మములిహపరదూరంబులై యుండు ననిన గోపాలదేవుని గాంచి ధనంజయుం డిట్లనియె. 96

## అష్టాదశో౽ధ్యాయము.

### — మోక్షసన్న్యాసయోగము. —

గీ॥ కృష్ణచక్రధరా హృషీకేశ పద్మ
నాభ త్యాగమ్మనంగ సన్న్యాసమనగ
నెట్టివో నాకు దెల్పుమా యిందిరేశ
వాని వినగోరుచుంటి నామానసమ్మున. 97

వ॥ అనిన హరి యిట్లనియె.

గీ॥ నెమ్మి వినుమయ్య కామ్యకర్మమ్ము లెల్ల
విడుట సన్న్యాసమని బుధుల్ నుడువుచుంద్రు
వివిధకర్మచయంబును వీడ త్యాగ
మని వచింపంగబడును గదయ్య సఖుఁడ. 98

ఉ॥ కర్మముచేత దోషములుఁ గల్గును గావున వీడుటొప్పు త
త్కర్మములంచుఁ గొందరు మఖంబులు మున్నగగల్గునట్టి స
త్కర్మములాచరించుటయె కర్జమటంచు వచింత్రుకొందరో
ధర్మజసోదరా కలవిధంబెఱిగించెద నాలకింపుమా. 99

గీ॥ సఖుఁడ నానిశ్చయం బదేచందమనిన
త్యాగమన మూఁడువిధములై దనరుచుండు
గాన సవనతపోదానకర్మముల త్య
జింపరాదట్టి కర్మాళిచేత జ్ఞాన
సిద్ధులౌవారలకు మనశ్శుద్ధిగలుగు. 100

గీ॥ కాంక్షల నడంచియును నేనె కర్తననెడి
దురభిమానం బడంచి సుస్థిరత కర్మ
ములనొనర్చుటయే మంచిఫలము పార్థ
దీని నజ్ఞానచిత్తులు దెలియకుంద్రు. 101

గీ॥ వెలయ నిత్యకర్మముల వీడగారాదు
వాని వీడనట్టివాఁడు మోహి
వాఁడె యట్టి మోహకలితుండు తామసుం
డగును క్రమముగా మహాబలాఢ్య 102

వ॥ కావున నియతములగు కర్మములు వీడుట యెవ్వరికిని తగవుకాదని
మఱియు నిట్లనియె. 103

గీ॥ దుఃఖముల్ దేహకష్టము దొడరుననుచు
గర్మములు వీడువాడు నిక్కమ్ముగాను
రాజస త్యాగిమైనను రాజపుత్ర
కా తదీయఫలంబులుఁ గాంచబోడు. 104

గీ॥ అరయ జేయంగదగిన దియ్యదియటంచు
ఫలములర్ వీడి సంగమాభావుడగుచు
జనుడు సల్పెడి కర్మమ్ము సాత్వికమ్మ
నాగ వచియింపబడు సురనాథ పుత్ర. 105

వ॥ అట్టి సాత్వికత్యాగముత్తమమని మఱియు నిట్లనియె. 106

గీ॥ సాత్వికత్యాగి మిగుల కష్టమ్ములైన
కర్మములదూరి మిగుల సౌఖ్యమ్ములైన
కర్మముల కాసజెందడా ఘనుడె సంశ
యమ్ము లేనట్టి మేధావియగును పార్థ. 107

గీ॥ వీరశేఖర యీదేహధారికరయ
కర్మములు వీడుటది మేలుగాదుఁగాన
దత్ఫలాపేక్ష వదలుట త్యాగమందు
రట్టి జ్ఞానిని త్యాగియటందురు బుధులు. 108

సీ॥ సఖుడ యిష్టమ్మ నిష్టమ్మ మిశ్రమమని
కర్మఫలంబు లిక్కరణి మూడు
విధమ్ములై దనరును విజయతత్ఫలమెన్న
త్యాగహీనులకెల్ల దనరుచుండు
సన్యాసులకుఁ గర్మచయముల ఫలములు
కొంచెమ్ము లేనబ్బకుండు పార్థ
సంతతమ్మునుఁ గర్మసంసిద్ధిఁగోరిన
వారై దెఱుంగగావలసియుండు

గీ॥ రనుచు వేదాంతసిద్ధాంతమున వచింప
బడియె నవి యెవ్వియనగ నేర్పడగవినుము
దెలియజెప్పెద నీకుఁ గుంతీతనూజ
భాస్కరసమాన తేజ వైభవబిడౌజ. 109

సీ॥ నెమ్మి దేహాభిమాన మ్మహంకారమ్ము

చక్షురాదింద్రియ సంచయమ్ము
ప్రాణాదులౌ వాయుపంచకవ్యాపార
ములును దైవమ్ము నెపుడుఁ గిరీటి
గాత్రవాఙ్మన సక్రమములఁ న్యాయమ్ము
గాని యన్యాయమ్ముగాని జేయు
యత్నమ్ము నర్పుట కారయ హేతువుల్
నిరుపాధికమ్ముగా బరగుచున్న
గీ॥ యట్టి యాత్మయె కర్మములాచరింప
హేతువని చూచునట్టివా డింద్రపుత్ర
మంచిదౌచూడ్కి లేనట్టి మానవుండు
వాఁడె కడుబుద్ధిహీనుఁడై వరలుచుండు. 101
గీ॥ కాన నెవ్వా డహంకారహీనుడగుచు
కాంక్షలుడుగునో వాఁడె నన్గాంచువాడు
వాడు హింసాపరుండగువాఁడె యైన
హింసఁ జేయనివాఁడె దేవేంద్రపుత్ర
కర్మములచేత నాతడు కట్టుబడడు. 111
గీ॥ జ్ఞానమని జ్ఞేయమని పరిజ్ఞాత నాగ
గర్మచోదన త్రివిధముల్గా జెలంగు
కరణము న్గర్మము న్గతికర్త నాగ
గర్మసంగ్రహము మ్మూఁడుగా జెలంగె. 112
సీ॥ కవ్వడీ జ్ఞానము కర్మము గర్తయు
గుణభేదమున్బట్టి కుంతిపుత్ర
మూడువిధమ్ము లిమ్ముగ నయ్యెనని సాంఖ్య
శాస్త్రజ్ఞులందురు సావధాన
ముగ వినుమీలోకముల సర్వభూతాళి
యందు విభాగము జెందకుండి
యవ్యయంబై యేకమైయున్న పరమాత్మ
గన సాత్వికజ్ఞాన మనగబడును
గీ॥ వెలయ తద్భూతములయందు వేరు వేరు
భావముల నాత్మఁగన్న ధృవంబుగాను

రాజసజ్ఞానమని బుధరాజచేత
నుడువబడుచుండు సమరవినోదశాలి. 113

వ॥ పార్థా సర్వాంతర్యామియైన పరమాత్మునందు ప్రీతిమాదికము
లందుఁ దక్కఁగొండొక ప్రదేశంబున లేడను జ్ఞానము తామస
జ్ఞానం బనబడును 114

సీ॥ కౌన్తేయ వినుము రాగద్వేషములు వీడి
యనపేక్షచేఁ గర్మమాచరింప
సాత్వికమనిచెప్పజను కాంక్షయును యహం
కారమ్ముగల్గి లోకమ్ము మెచ్చ
శ్రమబూనికీర్తికై సల్పు కర్మమ్ము రా
జస మనబడునయ్యా సవ్యసాచి
తనకుఁ మించిన కార్యమని విచారింపక
ధన నాశనంబని తలచికొనక

గీ॥ నెలమి రాబోవు మంచిచెడ్డలునుఁ గనక
నాచరించెడి కర్మమునందు హింస
దనరియుండినఁ గడు మౌఢ్యమున నొనర్చు
కర్మమెన్నఁగఁ దామస కర్మమగును. 115

వ॥ అని మఱియు నరునకా హరి యిట్లనియె. 116

సీ॥ అర్జునా సంగమహంకారముఁ వీడి
కర్మఫలాపేక్ష కడకు నెట్టి
ధైర్యముత్సాహమ్ము దనరి కర్మముసేయు
కర్త సాత్విక కర్తగా గణింతు
రనురాగహింసల నాచారలుబ్ధత్వ
హర్షశోకములు ప్రేమాతిశయము
గలిగిన రాజస కర్తగాగణియింతు
రార్యులు జాగుగలట్టివాడు

గీ॥ శఠుఁడు పరవంచకుండలసటగలట్టి
వాడు నమ్రతలేనట్టివాడు దుఃఖ
భావుఁ డవివేకియగువాడు పార్థ బుధుల
చేత తామసకర్త నాఁజెప్పబడును. 117

గీ॥ పార్థ వినుమయ్య గుణములబట్టి బుద్ధి
ధృతియు మూఁడేసివిధము లారీతివినుము
తెల్లముగ నీకు వివరింతు దేవనాథ
పుత్త్రి ఘోరాఘలతికాల విత్త్రిమిత్త్రి. 118.

సీ॥ భంధమోక్షములు వ్యాపార మవ్యాపార
మభయమ్ము భయము కార్యము లకార్య
ములు నెఱింగిన బుద్ధితలప సాత్వికబుద్ధి
నావచింపుదు రెల్ల కోవిదులును
తతబుద్ధి ధర్మ మ్మధర్మమ్ము కార్యమ్మ
కార్యముఁ దెలియలేకను జెలంగు
బుద్ధిరాజసమైన బుద్ధి నాఁదగు మిత్ర
తామసగుణ సంయుతమ్ము నగుచు

గీ॥ వెలయు ధర్మమ్ము ధర్మము దెలియలేక
నాత్మవిపరీతములగ సర్వార్థములను
దలచు బుద్ధియటంచు రుత్తములు రణవి
నిర్జితామిత్ర వీరవర్తిత చరిత్ర 119

వ॥ విషయములను ఘ్రాణేంద్రియాద్యఖిలేంద్రియ వికారమ్ములను బుద్ధి నిశ్చలత నిరోధించిన ధృతిసాత్విక ధృతియును మఱియు ధర్మార్థ కామంబుల విడువక కాంక్షలయందు చరించు ధృతిరాజస ధృతి మఱియు స్వప్నభయ దుఃఖవిషాద మాత్సర్యమోహాదుల దగు ల్పడు ధృతి తామస ధృతియనంబఱగు నింక సుఖంబులు మూఁ డు విధంబులగా మారె నందేసుఖంబు జెంది భూతపటలంబు దుః ఖములు వీడునో తత్సుఖంబు వినుమని హరి కిరీటి కిట్లనియె. 120

గీ॥ సఖుఁడ తత్సౌఖ్యమాది విషంబుబోలి
రాను రానయ్యది మె సుధారసముబోలు
నదియె సాత్విక సౌఖ్య మయ్యదియు బుద్ధి
నిశ్చలత గల్గుచుండు గాండీవపాణి. 121

గీ॥ వెలయుఁ విషయేంద్రియమ్ముల గలసి మొదట
నమృతమును బోలి రానురా విషమె గరళ
సామ్యమగునట్టి సుఖము రాజస సుఖంబు

భంజితారాతి సముదాయ పాండవేయ. 122
గీ॥ అరయ నాద్యంతములను మోహమున ముంచు
సౌఖ్యమెన్నగ తామస సౌఖ్యమందు
నరయగా నిద్రవలన నాయాసమున బ్ర
మాదమునఁ బుట్టుచుండుఁ జుమ్మా కిరీటి. 123
గీ॥ ప్రకృతిజనిత గుణాళిచే వదలబడిన
ప్రాణి జాలములేను ప్రపంచమందు
గాన జగమెల్లఁ ద్రిగుణసంకలితమగుచు
వెలయుచుండును నిజముగా వీరమౌళి. 124
సీ॥ సవ్యసాచీ పురాజన్మ సంస్కార సం
జనితమై తగు గుణసంచయమున
బ్రాహ్మణ క్షత్ర విట్పాదజులకుఁ గర్మ
ములు విభాగంబులు సలుపబడియె
శమదమాచారముల్ క్షమయు తపస్సును
జ్ఞాన విజ్ఞానముల్ శ్రద్ధ సత్య
మవని దేవులకు శౌర్యమ్ము తేజమ్మును
నేర్పు దానము రణనిపుణత ధృతి
గీ॥ నియతములు రాజులకును వాణిజ్య ధేను
రక్షణమ్ములు కృషియు కిరాటులకును
పాదభవులకు విప్రనృపాల వైశ్య
జాతులకు భక్తితో సేవ సల్పుటయును. 125
సీ॥ ఏపరమాత్మచే నీప్రపంచమున భూ
తమ్ముల వృత్తులు నెమ్మిఁ జరుగు
నేపరమాత్మ తానీ ప్రపంచమ్మున
నన్నిచోటుల లీనమై చెలంగ
నాపరమాత్మ నిత్యంబును నిజకర్మ
ములపూజసేయగా గలుగు సిద్ధి
యన్యకర్మమ్ముల కన్న స్వధర్మ క
ర్మమ్ములు సలిపిన మానవుండు
గీ॥ పాపముల నెప్డు గాంచడో పాండుపుత్ర

సహజకర్మము లెన్న దోషంబులైన
విడువగారాదు కర్మాళియడల నిప్పు
నందు పొగవలె దోషమ్ము లొప్పుండియుండు. 126
గీ॥ కాంక్షలన్నీడి మది నహంకారమెడల
జేసి యెద్దానియం దిచ్ఛజెందకుండి
సతముం సన్న్యాసమునం గర్మసంచయంబు
సలుపువానికి గల్గును సత్త్వశుద్ధి. 127
గీ॥ అరయ నైష్కర్మ్యసిద్ధిం బ్రహ్మంబు నెటుల
జెందునో నీకు నేను వచింతు వినుము
జ్ఞానమున కయ్యది యె గట్టి సవ్యసాచి
యని వచించి సురాధిపతనయుంగాంచి 128
సీ॥ సాత్త్వికబుద్ధియు సాత్త్వికధృతియును
గలిగి బుద్ధినిం గార్యకారణముల
గనం నియమించి నిక్కమ్ముగా శబ్దాది
విషయాళిరాగము ద్వేషముడిగి
శ్రద్ధగలిగిన ప్రదేశమ్మున వసియించి
పరిమితాహారుడై వాక్శరీర
చిత్తముల్ నియతముజేసి నిత్యధ్యాన
మునుగల్గి వైరాగ్యమును గలిగియు
గీ॥ లలి నహంకృతి బలదర్పములను మమత
గామము క్రోధమును వెలిగాం త్యజించి
నేన బ్రహ్మంబటంచును నిశ్చయముగ
దలచి శాంతినిబొందు నిశ్చలుడు పార్థ. 129
గీ॥ అర్జునా యట్టివాడు బ్రహ్మమును జెందు
వాడె విమలుండు దుఃఖముల్ వానిం బాయు
సర్వభూతసమానుండై సంతతంబు
కామములువీడి నాభక్తి గలిగియుండు. 180
గీ॥ పార్థ యెవండేనిగాని సద్భక్తిచేత
నన్నుం దెలియునో వాడెన్న నన్ను జెందు
నరయ కర్మిష్ఠుడైన నన్నాశ్రయింప

వానికబ్బును మామకావ్యయపదంబు. 131

గీ॥ తలఁప కర్మమ్ములను మదర్థముగ జేసి
నిశ్చలాసక్తి నాయందు నిలిపిబుద్ధి
యోగమున నన్నుగొల్చి మహోగరిష్ఠ
మైన పదమందుమయ్యు మిత్రాముదమున. 132

ఉ॥ ఆరయ పార్థనీకుహృదయంబున నాయెడ భక్తి గల్గినన్
బారములేని దుఃఖములబాసిచరించెద వాత్మలో నహం
కారముబూని నానుడులు గైకొనవేని ధృవంబుగా దయా
ధీరఫలంబులేదు భవదీయభవంబునకెన్న ఫల్గునా. 133

గీ॥ ఏయహంకారమూని రణేచ్ఛనీవు
కడకునెట్టితివా యహంకారమెన్న
కల్ల ప్రకృతియె నిన్నిష్టు కదనమాచ
రింప నియమింపగలదు కిరీటి వినుము. 134

గీ॥ సఖుఁడ పూర్వజన్మ సంస్కారజనిత శౌ
ర్యాది కర్మసంచయమున జిక్కి
మోహవశతఁ యుద్ధమున్ జేయ ననునీవె
చెలఁగి రణము సేయఁ గలవు చూడు. 135

సీ॥ కారణంబేమనంగా వినుమో సవ్య
సాచి బొమ్మల నైంద్రజాలికుండు
యంత్రమ్మునన్ ద్రిప్పుతంత్రమ్మునన్ స్వకీ
యంబైన మాయచే నఖిల భూత
పటలంబులన్ ద్రిప్పునటుగాన నరుడించు
కేని జేసెడి కర్మమెద్దిగలదు
సకలభూతముల నీశ్వరుడుండు నతనికి
మించువాడెవడు ప్రపంచమందు

గీ॥ కాన నేభావమున నేని జ్ఞానివగుచు
నెమ్మితో నీశ్వరుని చరణమ్ము నాశ్ర
యింపు మద్దాన నీకు లభింపగలదు
భవ్యతరమైన వైకుంఠపదము సఖుడ. 136

గీ॥ అర్జునా నీకు కడు రహస్యమ్ములందు

గల రహస్యము దెలిపితిర్ గాన తావ
కేచ్ఛచరియింపుమిక నేటికింత కర్మ
ములను వీడుట మేలుగాదలఘుచరిత. 137

గీ॥ పార్థవినుమింక మిగుల గోప్యంబు జెప్ప
దొడగుచుంటిని నామాట దొడ్డమాట
నిష్టుడవు నీవటంచు నేనిపుడు దృఢము
గాఁ ద్వదర్థముగా దెల్పగడగుచుంటి. 138

మ॥ నను సేవింపుము నన్మనోబ్జమున నన్నా నిల్పుమా నాకె వం
దనముర్ జేయుము పూజ సేయుమిక బార్థా నన్ను జెంద
గ వచ్చును సత్యముగ దెల్పుచుంటిని వి గచ్చుల్ గావునాకుర్ బ్రియుం
డని నిన్నెన్ని వచింపుచుంటిని మహాత్మా పాండురాజాత్మజా. 139

గీ॥ సకలధర్మాళి విడి నన్నె శరణుజొరుము
దుష్కృతములనుండి నిన్ద్రోలఁగ జేతు
సంశయములేదు మదిని విచారమేల
పాపజాలంబు నేననఁ బారుచుండు. 140

గీ॥ భక్తవర్యులుగాక తపస్సులేక
బఱఁగి గురుసేవఁ సేయక భావమునను
నన్నసూయగ నెంచెడి నరులకెల్ల
పార్థ నాచేత జెప్పగాబడిన గీత
లందుఁ దాత్పర్యముర్ జెప్ప టనుచితంబు. 141

సీ॥ అరయ నీపరమరహస్యంబు నాభక్త
వరులకు బోధించువాడు సతము
పరికింప నాయందు భక్తిగల్గినవాడు
వాడునన్జెందు ధృవంబుగాను
వానికన్న న్మానవవ్రజంబున నాకు
కవ్వడీ యుపకారికాడొకండు
వానికి నన్యుఁడొవాడు నాకు హితుండుఁ
గాడు కౌన్తేయ నిక్కమ్ము సుమ్ము

గీ॥ నక్తుడగుచు ధర్మ్యయక్తమా మనవాద
మెవ్వడేని జదువ యింద్రపుత్ర